# ANANDA
# SIXTH READER

FIFTH READER REVISED

TELUGU

# ఆనందవాచకపుస్తకము

ఆ ఱ వ త ర గ తి.

---

BY

KUCHI NARASIMHAM, B. A.,

AND

PANUGANTY LAKSHMI NARASIMHA ROW.

---

**Approved by the Director of Public Instruction, Madras.**

*"Fort St. George Gazette" dated 12th June, 1917.*

---

1929

**R. VENKATESHWAR & Co.,**

LOANE SQUARE, MADRAS.

ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో

లోన్ స్క్వేర్, మద్రాసు.



Price 6 Annas.] [వెల 6 అణాలు.

# బోధనపద్ధతులు.

1. బొమ్మలయొక్క [illegible]టఁ గేవలము బొమ్మలనుండియే పిల్లవాఁడెంత గ్రహింపఁగలఁడో ప్రశ్నలువేసి కనుఁగొనవలెను.

2. ఆపాఠమున కనుకూలించు నితరపటము లేవైన లభించిన యెడల, నవి చూపవలెను.

3. పిల్లవాఁడు పాఠము చదువునప్పు డుచ్చారణలోపము లున్నచో, నవి వెంటనే సవరింపవలెను.

4. పూర్వపుమార్గముగాఁ బ్రతిపదార్థములు చెప్పుటమాని, ప్రశ్నలువేసి వాక్యముయొక్క యర్థమును సాధ్యమైనంతవఱకు బాలురచేతనే చెప్పింపఁ బ్రయత్నింపవలయును.

5. కఠినమైనమాటలకుఁ దక్క, సామాన్యముగా వాడుకొనుమాటలకుఁ బర్యాయపదములు చెప్పనక్కఱలేదు. 'అంపము'నకు 'క్రకచ'మని కాని 'కరపత్రము'ని కాని యర్థము చెప్పఁగూడదు. దానిని వివరముగా చిన్నమాటలతో వర్ణించియో, అంపమునుగాని అంపపుబొమ్మనుగాని తెచ్చి చూపియో బాలురకుఁ దెలుపవచ్చును. వారికది యిదివఱకే తెలిసినయెడల నర్థము చెప్పవలసినావశ్యకము. కఠినపదములకు సులభపర్యాయపదములు చెప్పవచ్చును.

6. పాఠములో విషయము ముఖ్యము గనుక, నది బాలురకు స్పష్టమైనదో లేదో ప్రశ్నలమూలమున జాగ్రత్తతోఁ గనుఁగొనవలెను. పాఠములక్రింద ప్రశ్నలు కొంతవఱకు సహాయము లగును.

7. అర్థసంబంధమైనవి గాని, భాషాసంబంధమైనవి గాని, చమత్కారము లేవైన నున్నయెడల వానిని స్పష్టీకరింపవలెను.

8. పాఠము ముగించినతరువాత దానిని సంక్షేపముగాఁ గ్రిందితరగతులలో బాలురచేత నోటఁ జెప్పింపవలయును. పైతరగతులలో నిట్లు చెప్పించుటయే కాక వ్రాయింపవలెను. ఆవ్రాఁతవానిలో భాషాదోషములు [illegible]ములును బిల్లవానికిఁ గనఁబఱచి సవరింపించుటగాని సవరించుటగాని చేయవలెను.

9. సంభాషణరూపములుగా నున్న పాఠము లనుకూలములైన యెడల, బాలురచే నాటకభాగములవలె నప్పుడప్పుడు నాడింపవచ్చును.

10. జోలపాటలు, వసంతపాటలు మొదలగునవియైనచో బాలురచే ద్విపదలను మనోహరముగాఁ బాడింపవచ్చును.

11. క్రిందితరగతులలోఁ బ్రతిపాఠములో వచ్చు జంతువులనుగాఁ, వానియవయవములను గాని, ఇతరవస్తువులను గాని, బాలురసమర్థతలనుబట్టి, వీలైనంతవఱకు, బొమ్మలు గీయింపవలెను. రేగడమట్టితో వానిని జేయింపవలయును. అట్టలతోను, కాగితములతోను, వానియాకారములను గత్తిరింపఁ జేయవలెను. దారములతోఁ గుట్టింపవలెను, తీఁగలతో నల్లింపవలెను.

*

# Preface to the revised editions.

Messrs. R. Venkateshwar & Co. have written to us say that some of the Sub-Assistant Inspectors of Schools find our readers of the lower classes too difficult for the pupils for whom they are intended and asked us to revise them suitably to their wishes. They have also sent us detailed suggestions of two or three of them.

Some of their suggestions are really valuable and we have adopted them, with many thanks, in these revised editions.

But we regret we cannot see eye to eye with them in regard to most of their suggestions about *visandhi*. Visandhis, it is true, correctly present to the eye the naked original form of the word. But some of them are unnatural and mar all euphony of the language. For instance, ఆవు పాలు ఇచ్చును; కొండె గుఅని; నాలుగు ఉన్నవి, సూర్యుడు ఉన్నదిక్కు; చెప్పిఅన్నను; ఇవిఏవో-అయిదుఅణాలు-గారులు అందురు. and such like splittings are nowhere to be heard, in the actual speech of the child and sound rather outlandish to the ear, besides making the reading lesson most painful to the child pupil.

However, out of deference to the officers who have made the suggestions, we have now introduced almost all such visandhis in our reader quite against our will, taking care to gradually minimise them in the third and the higher readers.

Meter and other considerations have made it impossible for us to employ *visandhis* in our poetry.

Though there is a school of thinkers who are opposed to the *direct* teaching of morals and maxims to children through isolated verses, we have, agreeably to the wishes of our friends, supplemented our poetry in the lower readers with some good moral verses taken from the works of other writers, ancient or modern.

PITHAPURAM, 2-2-1920

K. NARASIMHAM,
P. L. NARASIMHA RAO

# పీఠిక.

---

క్రింది తరగతుల యానందవాచక పుస్తకములు కఠినములుగా నున్న వని కొందఱు విద్యాశాఖాధికారు లభిప్రాయ పడుచున్నారు. కావున వలయుచోట్ల దిద్ది వానిని సులభముగా వ్రాయుఁడని యానందముద్రాలయము వారు మమ్ముఁ గోరినారు. ఇద్దఱుముగ్గురు సబ్బసిస్టెంటిన్స్పెక్టరుగార్ల యభిప్రాయములు కూడ మా కంపినారు.

వారు గోరిన సవరణలలో మాకు సమ్మతములైనవానిని వందన పూర్వకముగాఁ జేసితిమి. విసంధులఁగూర్చి మేము వారితో నేకీభవింపఁజాలకున్నాము. శబ్దముయొక్క నిజరూపము పిల్లలయెదుటఁ బెట్టవలయునని వారి యభిప్రాయము, అది మంచిదే కాని, నియమరహితముగా విసంధులు చేసినయెడల, బాలుర కస్వాభావికోచ్చారణ మలవడుటయే కాక భాషా మాధుర్యమునకు భంగము కలుగును. చదువునప్పుడు పిల్లల గొంతుకలు నొప్పిపెట్టి, పాఠము క్లేశకర మగును.

కనుక మేమిప్పుడు రెండవవాచక పుస్తకములోఁ జేసిన పెక్కువిసంధులు విద్యాశాఖాధికారుల యెడల మా గౌరవమును జూపుటకుఁ జేయఁబడినవి కాని మనఃపూర్వకముగాఁ జేయఁబడినవి కావు. పై తరగతుల పుస్తకములలోఁ గ్రమముగా నట్టి యనిష్ట విసంధులు తగ్గించినాము.

ఛందోభంగాదిభీతిచేఁ బద్యములలో విసంధులు చేయుటకు వలనుపడినదికాదు. ఉపాధ్యాయులకొఱకు నుద్దేశింపఁబడిన ప్రశ్నలందును వ్యాకరణ భాగములలోను విసంధులు చేయలేదు.

వెనుకటి పీఠికలోఁ, గ్రింది వాచకపుస్తకములందలి పద్యములన్నియు స్వవిరచితములని వ్రాసితిమి. పై యుద్యోగుల యభిప్రాయము ననుసరించి యిప్పుడితర కవికృతములైన కొన్ని నీతిపద్యములు వానికిఁ జేర్చితిమి.

పిఠాపురము.
2-2-1920.

కూచి నరసింహము,
పానుగంటి లక్ష్మీనరసింహారావు.

# ఉపోద్ఘాతము.

రెండవతరగతి మొదలుకొని యెనిమిదవతరగతి వఱకు, అనఁగా మూఁడవ ఫారము చివరవఱకుఁ జదువుకొను బాలుర కుపయుక్తమగునట్లు వాచకపుస్తకములను వ్రాయ నెంచితిమి. బాలురవయస్సును సమర్థతను మనసునందుంచుకొని, యేవిషయములఁగూర్చి చెప్పినయెడల వారు బాగుగ గ్రహించుకొనఁగలరో యట్టివిషయములఁగూర్చియే వ్రాసెదము. ఆవిషయములైనను బాలురు నేర్చుకొనుట కుత్సాహపడునట్టివియే యేర్చి వ్రాసెదము. విసుగు పుట్టకుండునట్లు వేఱువేఱు విషయముల బోధించెదము.

అదిగాక, బాలుర వయస్సు, బుద్ధి, యెట్లు క్రమక్రమముగ వృద్ధినొందునో పాఠములలోని కష్టము, విషయములలోని కష్టము, నట్లు వృద్ధినొందునట్లు సాధ్యమైనంతవఱకుఁ జూచి వ్రాసెదము. మే ముపయోగించుభాష సులభముగనే యుండును; కాని యదిగూడఁ బైతరగతులకుఁ బోయినకొలఁది బాలుర వయస్సమర్థతల కనుకూలించునట్లు రవంత ప్రౌఢముగాక మానదు. అంతేకాని యతిదీర్ఘములగు సమాసములనుగాని వాడుకలో లేని గ్రాంథికశబ్దములనుగాని యుపయోగించి భాషను దుర్గ్రాహముగఁ జేయము. మఱియు వాడుకలో నున్న పదములు కదా యని యెంచి వ్యాకరణదుష్టరూపములను బ్రయోగింపము.

మొక్కలనుగూర్చికాని జంతువులఁగూర్చికాని వ్రాయునప్పుడైనను, వృక్షజంతుశాస్త్రములలోని దుర్గ్రాహ్యాంశము లందుఁ జేరనీయక, తెలుపఁదగిన ముఖ్యాంశములనువదలక సామాన్యపాఠములవలెనే యవిగూడ సుబోధము లగునట్లు వ్రాసెదము. శాస్త్రవిషయిక పాఠములను జదువుకొనునప్పుడైనను వానిలోని విషయములను గ్రహించుకొను నొత్తుడు బాలురచిత్తములకుఁ దగులకుండునట్లుగాఁ బాఠరచనాపద్ధతి చిత్తరంజకముగా నుండునట్లు చేయఁ బ్రయత్నింతుము.

అడుగు తరగతుల వాచకపుస్తకములలో, విసంధులను గొన్నికొన్నిపట్లఁ జెరుగన్న యాధునికవచనగ్రంథకర్తలు వాడియున్నారు. అట్లొనర్చుట మంచిదనియే మాయభిప్రాయము. అయినను వానిని మే మొక్కనియమము ననుసరించి జాగరూకతతో వాడెదము. శబ్దముల కర్థము స్పష్టము గాదని తోఁచినచోట్లఁగాని, విపరీతార్థము లగునని తోఁచినచోట్లఁగాని, విసంధుల నుపయోగించెదము. శ్రవణకటుత్వము కలుగునని తోఁచిన కొన్నిచోట్లఁ గూడ వాని నుపయోగించెదము.

వాచకపుస్తకముల నడుమఁగాని తుదనుగాని కొన్ని పద్యములఁ జేర్చెదము. అడుగుతరగతుల పుస్తకములలోని పద్యములు స్వకల్పితములు. అవి తఱచు మంజరీ లక్షణ సమన్వితములై యుండును. దసరాపాటలవలె నింపుగ బాలురు పాడుకొనుట కర్హములై యుండును. కావున, మంజరీలక్షణమును బద్యరచనయం దుపయోగ పఱచెదము. పైతరగతుల వాచకపుస్తకములలోని పద్యములు కొన్ని స్వకల్పితములు, కొన్ని పూర్వకవిరచితములై యుండును. పూర్వకవి గ్రంథములలో నేయేపద్యములు రసవంతములై నీతిబోధకములై యుండునో యాపద్యముల నేరియేర్చి వాచకపుస్తకములందుఁ గూర్చెదము. వానితోఁ గథా సందర్భములఁ దెల్పు కొన్ని వాక్యములును సంక్షేపముగ వ్రాసెదము.

వ్యాకరణములోని సులభాంశములఁ గొన్నిటిని వాచకపుస్తకముల తుదను జేర్చెదము. వీని నాయాతరగతుల యుపాధ్యాయులు చూచి బాలురకు బోధించుట మంచిదని మాయభిప్రాయము. అడుగు తరగతుల వాచకపుస్తకములలో వ్యాకరణ పరిభాషాపదములకు సాధ్యమైనంతవఱకుఁ జోటీయము; కాని, పైతరగతి పుస్తకములలో మాత్రము వాని ప్రయోగము లావశ్యకము లైనప్పుడవి యుపయోగించెదము. అయినను సులభములగు మాటలతో నాయాపదముల కర్థము లాతావులందే వ్రాసెదము. వ్యాకరణసూత్రములను గేవలసూత్రరూపముగ బోధించుటకంటె నీదిగువను జెప్పినవిధమున బోధించుట యుక్తమని మాయభిప్రాయము. ఏసూత్రము నుపాధ్యాయుఁడు బాలురకు బోధింప నెంచునో యాసూత్రముక్రిందరాఁదగిన యుదాహరణములను సాధ్యమైనంతవఱకు వాచకపుస్తకములలోనివే యేఱి బాలురయెదుటఁ బెట్టవలయును. అన్ని యుదాహరణరూపములందుఁగూడ సమానముగఁ గలిగిన మార్పేదో సమానలక్షణమేదో బాలురు తమంతఁదాము పరిశీలించి గ్రహించుకొను నట్లుపాధ్యాయుఁడు చేయవలయును. ఆసామాన్యపు మార్పేదో యది యెప్పుడు కలుగునో బాలుర నోటనే సాధ్యమైనంతవఱకుఁ జెప్పింపవలయును. అదియే, కాలోచితమగు చిన్న వ్యాకరణసూత్ర మగును. వ్యాకరణాంశముల నీరీతిగ బోధించుట యుత్తమము. బోధననిపుణులగు నుపాధ్యాయుల కట్లు చేయుట కష్టముకాదు.

విశేషానుభవము గల యుపాధ్యాయులుగాని తదితరులుగాని మావాచక పుస్తకములలో నేవైన లోపములున్నయెడల దయాపూర్వకముగఁ గనఁబఱచి నచో, వానిని గృతజ్ఞతాభివందనములతో గ్రహించి తరువాతికూర్పులో సవరించుకొనెదము.

# విషయసూచిక.

---

## మొదటి భాగము.

PART I. పుట

## రెండవ భాగము.

## PART II.



## మూఁడవ భాగము.

## PART III.



---

# ఆనందవాచకపుస్తకము.

## ఆఱవ తరగతి.

---

### 1. దాంభికుఁడు.

ఒక దాంభికుఁ డొకరోజున నొక గ్రామములోనికి వచ్చెను. అతఁడు మిగుల ఎత్తయినవాఁడు. యాత్రికులు ధరించు వస్త్రములను ధరించియుండెను. ఆ వస్త్రములు దీర్ఘములుగా నుండెను. అతఁడు మక్కానుండి అప్పుడే వచ్చిన యాత్రికసంఘముతోఁ గూడ వచ్చెను. అట్టివాఁ డతఁ డా యూరిప్రభువును గాంచి "ప్రభూత్తమా! అలీవంశములోని వాఁడను. మక్కాయాత్రను ముగించుకొని యిప్పుడే వచ్చినాను. ప్రభువువారిపై నేను రచించిన పద్యమాలిక యిదిగో" అని పలుకుచు ఒక కాగితము వారికి సమర్పించెను. రాజసభలో ఒక పండితుని కా కాగితమును ప్రభుఁ డిచ్చి చదువు మనియెను. ఆ పద్యములను వాని యర్థములను విని ప్రభువు మిగుల ఆనందించెను. వెలగల బట్టలిచ్చి, కొంతధన మిచ్చి ప్రభుఁ డా కవిని మిగుల గౌరవించెను.

ఇంతలో సముద్రయానమొనర్చి యీ గ్రామమునకు వచ్చిన రాజోద్యోగి యొకఁడు "ప్రభూత్తమా! ఈయన మక్కానుండి వచ్చియుండలేదు. ఒక్కడీ పండుగురోజున నీతని నేను బజారులోఁ జూచినాను" అని చెప్పెను. ప్రభుఁ డీమాటలనువిని కొంచెము సందేహించుచుండఁగా మఱియొక యుద్యోగి లేచి 'రాజేంద్రా! నాకిప్పుడుజ్ఞప్తివచ్చినది. ఈతఁడు మాల్టాద్వీపములోని యొక క్రైస్తవమతస్థుని కొడుకు. అలీవంశములో

బుట్టిన మహానుభావుఁడ నని యీతఁడు చెప్పుట వింతగా నున్నది" అని పలికెను. ఈమాటలు విని ప్రభుఁడు కనుబొ మలు చిట్లించి,కన్నులెఱ్ఱచేసి యేదియో పలుకఁబోవుచుండఁగా మఱియొక యుద్యోగి లేచి "మహాప్రభూ! ఈతఁడు రచి యించితి నని వచించి తమకు దాఖలుచేసిన పద్యమాల మన 'అన్వర్' కవి రచియించిన గ్రంథములోని" దని చెప్పి యా పుస్తకమును దగ్గఱనున్న బీరువానుండి తీసి చూపెను.

రాజు మహాగ్రహాయుక్తుఁడై యాత్రికుని సభలో నేకొట్టి, తన్ని, యావలకీడ్చివేయవలసిన దని యుత్తరు వొసంగెను. కొందఱు రాజభటులు చేతికఱ్ఱలు సవరించుచుండిరి. కొందఱు కాలిజోళ్లను సరదుకొనుచుండిరి. మఱికొందఱు చొక్కా చేతులను వెనుకకు మడఁచుచుండిరి. ఇంతలో ఆయాత్రికుఁడు మనసులో జంకులేక, మొగమున సిగ్గులేక, స్వరమున వడఁకులేక,పలుకులలో తొట్రుపాటులేక, చిరునగవున లేచి "మహాప్రభూ! మఱి యొక్కవాక్యమును బలికెదను. దానిలో అసత్యమేదైన నున్నయెడల ప్రభువువారే శిక్ష విధియించినను నాకు సమ్మతమే. వేయేల? యిష్టమైనయెడల శిరను తీయింపవచ్చును" అని ఝూంకారములోఁ బలికెను.

ఆమాటలను విని రాజు కొంత నిశ్చేష్టుఁడై యొక్క కనుఱెప్పపాటు కాలము నిదానించి "ఆ మాటయేది"? అని యడిగెను.

అంత యాత్రికుఁ డిట్లు పలికెను. "రాజోత్తమా! గొల్ల వాఁ డిచ్చిన పిడుతెఁడుమజ్జిగలో నిజమైన పెరుఁగొకగరిటెఁడు కంటె ఎక్కువయుండునా? దానిఁ డసత్యమాడె నని ప్రభు

వుల కాగ్రహ మేల? యాత్రికుల మాటలలో నున్న బండార మిదియేకదా !

అదరు బెదులు వణఁకు తొనఁకు లేకుండఁ జెప్పిన యా మాటలను విని రాజు పకాలున నవ్వెను. రాజోద్యోగులందఱు కొక్కెట్టున నవ్విరి. "యాత్రికుఁడా! నీ విట్టి సత్యమగు మాట యెన్నఁడును ఆడియుండవు. సంతసించితిని. నీకుశిక్ష లేదు. ఇదివఱకొసఁగిన బహుమతులతో నీవు నెమ్మదిగా సభవిడిచి పోవచ్చు" నని రాజు పలికెను.

---

## 2. ఎక్కువవారు, తక్కువవారు.

జనులలో ఎక్కువ తక్కువలు బుద్ధి బలమునుబట్టియు విద్యాబలమునుబట్టియు భూధనములఁబట్టియు వృత్తిభేదములఁ బట్టియుఁగలుగుచున్నవి. వ్యాపారభేదముల ననుసరించి గౌరవ లాఘవము లున్నను, జన్మములలో నరజన్మముత్తమముగనుక. మనుజు లందఱును గౌరవపాత్రు లనుమాటమఱవఁగూడదు.

న్యూనతాధిక్యములున్నను ఉండుఁగాక. ప్రతిజీవికిని ఆత్మ గౌరవ ముండకతప్పదు. అది లేనివాఁడు మనుష్యశబ్ద వాచ్యుఁడు కాఁజాలఁడు.

మనము, సములయెడల సమగౌరవమును, అధికులయెడల అధికగౌరవమును చూపుచు, మనకంటెతక్కువవారియెడలను ప్రేమరూపమైన గౌరవమును జూపుచుండవలెను. నవుకరు యజమానుని భక్తిశ్రద్ధలతోను గౌరవముతోను గొలువవలెను. యజమానుఁడుకూడ నవుకరును పుత్రభావముతోఁ జూచి యతనిని తనప్రేమకును దయకును పాత్రునిఁ జేయ

వలెను. ఇట్టి పరస్పరానురాగ, మనోన్యన్యసుఖదాయకము. సేవకులు విడిచిపోవునప్పుడు, పుత్త్రులను కోల్పోయినతండ్రులవలె, వలవలయేడ్చిన యజమానులు గలరు. స్వామిప్రాణరక్షణార్థమాత్మప్రాణత్యాగము చేసిన సేవకులును గలరు. ఈ క్రింది కథను వినుఁడు.—

1776-వ సంవత్సరపు శీతకాలమున భార్యాసమేతుఁడై ‘పోడోట్స్కీ’ ప్రభువు ‘వియన్నా’ నుండి ‘క్రకో’కు బండి మీఁదఁబోవుచుండెను. వారు ‘అజ్వోక్కు’ నకును ‘క్రకో’కుఁ గొన్నిమైళ్లలోనున్న ‘జేటరు’ నకును సమీపమునుండిరి. ‘కార్పేథియను’ కొండలలో తోడేళ్ల గుంపులు మెండు. చలికాలములో వాని క్రౌర్యమును తెగువయు మతియెంతో హెచ్చుగా నుండును. అట్టి వృకనికరములు నాలుకలు వ్రేలాడ్చుచు వారి వెంట తఱుముకొని వచ్చుచుండెను.

వారి యిద్దఱు సవ్వకులలో నొకనిని అంచెగుఱ్ఱములమాటులాఁడి సిద్ధముగా నుంచుటకు ముందు పంపిరి. మిక్కిలి విశ్వాసపాత్రుఁడైన రెండవవాఁడొక గుఱ్ఱముమీఁద సవారి చేయుచు కూడవచ్చుచుండె. క్రేళ్లుఱుకుచు యమదూతలవలె సమీపమునకు వచ్చుచున్న తోడేళ్ల నతఁడు చూచి “అయ్యా! నాగుఱ్ఱమును దిగి యిక్కడవిడిచెదను. దానిమీఁదఁబడి పీఁకుకొనితినుచు తోడేళ్లు కొంతసేపాలస్యముచేయును. ఇంతలో మనము ‘జేటరు’ సమీపమునకుఁ బోవచ్చును. అట్లు చేయనిం’’డని యజమానుని సెలవడిగెను. ప్రభువు దానికి మంచిదనెను. సేవకుఁడు గుఱ్ఱమును దిగవిడిచి బండి వెనుక నెక్కెను. వృకములు పాప! మాగుఱ్ఱముపైఁబడి దానిని సహస్ర

ఖండములుగాఁ జీల్చివైచెను. చేరువనున్న యూరికి త్వరగాఁ బోవుదమని" గుఱ్ఱముల గట్టిగాఁ గొట్టిరి. కాని, యవి మిక్కిలి డస్సియుండుటచే, వలసినంత వడిగాఁ బోఁజాలవయ్యెను. రక్తమును చవి చూచిన యామృగశ్రేష్ఠస్వరూపములు మిక్కిలి వేగముతోఁ బరుగెత్తుకొని వచ్చుచుండెను. ఎఱ్ఱని నిప్పులవలె నున్న భీకర నేత్రములు కనఁబడుచుండెను. ఆనోళ్ళలోనుండివచ్చు శ్వాసధ్వనులు ఝంఝానిలనాదములవలె వినఁబడుచుండెను. అవి యిప్పుడే చాల దగ్గఱగా వచ్చెను. ఇట్టి యపాయస్థితిలో వెనుకనున్న నవుకరిట్లు బిగ్గఱగా నఱచెను. "స్వామీ! ప్రాణరక్షణమార్గమొక్కటే కనఁబడుచున్నది. నాభార్యను బిడ్డలను తండ్రివలెఁజూచి కాపాడెద నని మీరు ప్రమాణముచేయునెడల నేనిప్పుడే దుమికి తోఁడేళ్ళ కెదురుగా వెళ్లెదను. నేను చావకతప్పదు. కాని, యీలోపల మీరు మీప్రాణములను దక్కించుకొనవచ్చును."

అట్లు చేయ నొప్పుకొనుటకు, మొట్టమొదట పోటాట్స్కీకి ప్రాణమొప్పలేదు. ఒప్పుకొనని యెడల, నొక్కప్రాణమైన నిలువదని స్పష్టముగాఁ దెలియును. ఇట్టి స్థితిలో చిట్టచివరకు ప్రభువు "నీవు మాకై ప్రాణమర్పించిన యెడల నీకుటుంబమును నేను శాశ్వతముగఁ బోషించెదను. ఇది దైవము సాక్షిగాఁ జెప్పుచున్నాను" అని గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచుఁ జెప్పలేక చెప్పలేక చెప్పెను.

నవుకరు తత్క్షణమే దిగి వెళ్లి తోఁడేళ్ళ కెర యయ్యెను. ప్రభువును భార్యయు 'జేటరు' సురక్షితులై చేరిరి. అన్న యక్షరముల ప్రకారము ప్రభువు వాగ్దానమును నెరవేర్చెను.

# 3. ఉష్ణమానము.




మనశరీర మందలిజ్వరమును జ్వరమానముతో నెట్లు కొలువఁగలమో నాల్గవపాఠపుస్తకమునందు మీరుచే దివి యున్నారు. ఎల్లప్పుడును ప్రతివస్తువునందును ఎంతో కొంతవేఁడియుండక మానదు. వేఁడి యన్నను ఉష్ణ మన్నను ఒకటేయర్థము. అట్టి యుష్ణమును కొలుచు గాజుగొట్టమునకు ఉష్ణమాన" మని పేరు.

జ్వరమానమువలెనే యుష్ణమానముగూడ రెండు కొనలునుమూసియున్న యొక సన్నని గాజుగొట్టము. దానివలెనే యిదికూడ ఒక కొనను కొంచెము లావు గానుండి, రెండవ కొనవఱకునుతలవెండ్రుకవాసిరంధ్ర ము గలిగియుండును. దానిలో కొంతవఱకు పాదరస ముండును. ఈగొట్టముమీఁద "౦" మొదలు "212" పైఁగా సమభాగములను తెలియఁజేయుగీఁతలుండును. వీనికి "డిగ్రీ" లని పేరు, కాని యెట్లీసమభాగములనే ర్పఱచుచున్నారో మనము తెలిసికొనవలసి యున్నది.

మొట్టమొదట పైకొనమాత్రము తెఱచియున్న గొట్టముతీసికొని, దానిని కొంతవఱకు పాదరసముతో నింపుదురు. తరువాత దానిని సారాయి దీపముమీఁద కాఁచఁగా పాద రసము విరివిహెచ్చి కొంత వాయుపదార్థముగా మాఱును. అప్పుడు గొట్టమున, ద్రవరూపమునను, వాయురూపమునను ఉన్న పాదరసముతప్ప, గాలికాని, మఱొకటిగాని యుండదు. అట్టిస్థితిలో పైకొన మిక్కిలి వేఁడిగల దీపములోనుంచి మెత్తఁ

బఱచి మూసివైతురు. తరువాత దానిని చల్లారనిచ్చినచో పాదరసము క్రిందికి దిగును. గొట్టములో పాదరసమునకు పైని గాలియుండదు గాన తిరుగవెచ్చఁజేసినచోఁ బాదరసము పైకి ప్రాఁకును.

తరువాత కరఁగుచున్న మంచుగడ్డను గుండగాఁ గొట్టి దాని నందులో నుంచినఁ బాదరసము గొట్టములో నెచ్చట నుండునో, యచ్చట నొక గీఁతగీయుదురు. దానియొద్ద 32 అంకె వేయుదురు. అనఁగా నెక్కడనైనను కరఁగుచున్న మంచుయొక్క యుష్ణత 32 డిగ్రీ లన్నమాట.

ఇట్లే మఱుఁగుచున్న నీటియావిరిలో గాజుగొట్టము నుంచి పాదరస మెచ్చటనుండునో యక్కడ గీఁతగీఁచి 212 అంకె వేయుదురు. అనఁగా మఱుఁగు నీటియావిరియొక్క యుష్ణత 212 డిగ్రీ లన్నమాట.

తరువాత ఈ రెండుగీఁతలయొక్క మధ్యభాగమును 180 సమభాగములుగా విభజించి, గుఱుతులు పెట్టుదురు.

దీనితో నీటియొక్క యుష్ణము కొలువవలె ననుకొందుము. అప్పు డుష్ణమాననాళముయొక్క యడుగుభాగము నీటిలో నుండునట్లు పట్టుకొని లోని పాదరస మెంతవఱకు ప్రాఁకునో యన్ని డిగ్రీల యుష్ణము నీటియందుఁ గలదని చెప్పవలెను.

ఇట్లే వాయుమండలి యుష్ణమునుగూడఁ గొలువఁగలము. అందుకొఱకు ఉష్ణమానమునకు దారమొకటి కట్టి, గాలిలోఁ గొంతసేపు వ్రేలాడఁదీయవలెను. పాదరస మప్పుడే యంకె యొద్దనుండునో గాలియుష్ణ మన్ని డిగ్రీ లన్నమాట.

32 డిగ్రీలకంటె ఎక్కువ శైత్యమును, 212 డిగ్రీలకంటె

ఎక్కువ యుష్ణమును, ఒక్కొక్కప్పు డుండవచ్చును గాన, అట్టి యుష్ణశైత్యముల నగపఱచుటకు 32 క్రిందను కొన్ని గీతలును 212 పైని కొన్ని గీతలును ఉష్ణమానవాళము మీఁద గీయఁబడియుండును.

ఈయుష్ణమానవాళముమూలమునే వేసంగిలో ఈచోట ఇంత వేఁడియనియు, శీతకాలములో ఇచట ఇంత శైత్యమనియు మనకుఁ దెలియవచ్చుచున్నది.

ఇదివఱకు మీరుచూచిన జ్వరమానమునకును ఈయుష్ణమానమునకును కొంచెము భేదముగలదు. రెండవది చూపునంత వేడి మొదటిది చూపలేదు. జర్వమానములో ఒకసారి పాదరస మెక్కిన తరువాత మనము ప్రయత్నించి దింపువఱకు మఱల అది దిగదు. ఉష్ణమానములో అట్లు కాదు.

---

## 4. రాజు, పకీరు.

ఒక దేశమున నొక రాజుండెను. అతఁడు మిగుల భోగప్రియుఁడు. మేడమీఁదఁ గూర్చుండి వివిధములగు భోగముల ననుభవించుచు నొడలు దెలిసియుఁ దెలియకుండునట్లు త్రాగి "నేనీక్షణమునఁ బరమసుఖవంతుఁడనై యున్నాను. నాకు దేనిని గూర్చి కాని లేశమైన విచారములేకుండనున్నాను" అనియెను. ఆమాటలను వీధిలో నిలుచుండునొక పకీరువిని "మహాప్రభూ మహాదృష్టమున మీతోసమాను లెవ్వరును లేరు. మిమ్ముఁ గూర్చి మీ కేమియు విచారము లేదని నే నెఱుఁగుదును. మావంటివారిని గూర్చి మీకే విచార ముండకపోయిన మఱి యెవ్వరి కుండును" అని బిగ్గరగ బలికెను.

ఆమాటలు రాజు విని సంతసించి గవాక్షమునొద్దకు వచ్చి పకీరును గాంచి "అయ్యా! ఇవిగో వేయిదీనారములు. ఒడి పట్టుము" అని పలికెను. పకీరు నవ్వి "బట్టయున్నవాఁ డొడి పట్టఁగలఁడు గాని, నే నెట్లు పట్టఁగలను?" నని తిరుగఁ బలికెను. పకీరుమాటలు రాజు విని మిక్కిలి పరితపించి వస్త్రములతోఁ గూడ నానాహేమములసంచిని పకీరునొద్దకుఁ దన సేవకునిచేఁ బంపించెను.

ఆఘన మంతియును ఆపకీరు కొలఁది దినములలో వ్యయ పఱచి రాజును దిరుగ యాచింప వచ్చెను.

గీ. ఎలపుగలవాని మనసులో • పలను శాంతి
యిలను బైరాగి చేతిలో • పలను సొమ్ము,
జల్లెడను నీరు నిలువగా • జాలవనెడు
బుద్ధిమంతుల మాటలు • పొల్లుగావు.

రాత్రి రాజకార్యచింతామగ్నుఁ డై యుండఁగా నాతని యుద్యోగు లీపకీరురాక యాతనితో విన్నవించిరి. రాజు రోష యుక్తుఁడై మొగము చిట్లించెను. రాజున కమితమగు ధన మున్నది. కావున నాతఁడు పరమసుఖి యనుకొందుము. అది పట్టితప్పు. అతనికి రాజ్యాంగసంబంధము లగు చింత లనేకసహ స్రము లుండును. అట్టి చింతాసమయమున సామాన్య యాచ కాలాపము లాతనిఁ గోపోద్దీపితునిఁ జేయును.

"అదనెఱుఁగకుండఁ దెమ్మని • యవనిధవుని
నడుగునాఁ డాశ్రితునకుఁ దిక్కై • యగును జుమ్మ."

అని పెద్దలు వచియించిరి. రాజారీతిని మొగము చిట్లించుకొని వినుగుతో నిట్లనియెను "పకీరు తిరుగ వచ్చినాఁడా? ఆతనిఁ దన్ని కోటనుండి యవ్వలికి సాగనంపుఁడు. ఇంత శీఘ్రకాల

ములో అంతసొమ్ముఖర్చు పెట్టినాఁడా? రాజధనము బీదలనోళ్లు నిండుట కేగాని యిట్టిపైతానుల పొట్టలు నింపుటకా ? పగలు కర్పూర దీపముతో కాలక్షేపము చేసిన మూర్ఖునకు కొలఁది కాలములో నే రాత్రి దీపమునకు చమురుండదని పెద్దలు చెప్ప లేదా?''

ఆమాటలు విని యాతనిప్రధానులలో నొక బుద్ధిమంతుఁ డిట్లనియె. "మహాప్రభూ ; ఇట్టి పకీరుల కొకసారియే విశేషధన మీయఁ దగదు. కొలఁది కొలఁదిగా ఇచ్చుచుండవలయును. ఎప్పటి కెంత యావశ్యకమో యప్పటికంతయే యొసఁగవలయు ను. వీరికిసొమ్ము దాఁచుకొనవలయు నన్నముందుదృష్టియు లేదు, దాఁచి కొనుటకు తావును లేదు. కాని యిప్పుడు తాము విను గుచేఁ బలికిన నిందోక్తులు ప్రభువున కర్హము లగునవి కావు. మీ రతనికివేయిదీనారములిచ్చిన దాతలు కావునఁ దిరిగియాస పడి వచ్చినాఁడు. ఆశ యెవ్వరికిని గలిగింపరాదు. కలిగిం చిన తరువాతను కఠినముగ యాచకులను నిరాకరింపఁగూడదు. అరేబియా యెడారిలోని బాటసారులు దాహముచే తపించు చున్నను సముద్రతీరమును జేరరు. ఎచ్చోట మంచినీళ్లగుంట యుండునో యచ్చటనే మనుజులు పక్షులు కీటకములు గుం పులు గుంపులుగా జేరుట చూచుచున్నాము."

---

## 5. దాంభిక విద్యార్థి.

గర్వము కూడని గుణము. బడాయియెప్పటికిని భంగమును దెచ్చును. అడఁకువచేఁ జెడినవారును ఔద్ధత్యముచే బాగుపడిన

వారును గానరారు. వాస్తవమైన యీక్రింది కథవలన గర్వి యెప్పుడును నగుబాటు చెందు నని తెలిసికొనగలము.

రెయిలుబండ్లు రాకముం దిగ్లండు దేశములో జను లంచె గుఱ్ఱపుబండ్ల మీఁదఁ బ్రయాణముచేయుచుండిరి. ఆగుఱ్ఱపుబం డ్లనేకులు బాటసార్లను. సరకులును బట్టునట్లువిశాలముగానుండె డివి. మజిలి మజిలీ కడను ప్రయాణస్థు లెక్కుటకును దిగుట కును విశ్రాంతిఁగొనుటకును సదుపాయము లుండెడివి.

ఇట్టి యంచెబండిలో నొకతఱి నొక మహాపండితుఁ డగు పోర్సనుదొర ప్రయాణము చేయుచుండెను. ఆయన వాలక మును వైఖరియు వింత వింతగా నుండెడివి. ఆతనితో నితరు లనేకులు ప్రయాణము చేయుచుండిరి. కాని యాయన యెవఁ డో, వారిలో ఒకరును ఎఱుఁగరు.

ఆక్స్ఫర్డులోఁ జేదువుకొనుచున్న యొక పడుచువిద్యార్థి బండిలో ప్రయాణము చేయుచున్న కొందఱు స్త్రీల వినోదము కొఱకు వివిధవిషయములఁ గూర్చి ప్రసంగించుచు ననేకము లైన యుత్తరకుమారప్రజ్ఞలుకొట్టుచు నొకవాక్యము చదివి యది * సోఫాక్లీజులోని దని చెప్పెను. బండిలో నొకమూలను గునుకుచున్న పండితుని చెవిలో ఆ మాటలు పడఁగానే యతఁడు బండిలో గ్రీక్కుభాషాప్రసంగ మే మని తటాలున లేచి యొడలు విఱుచుకొని కన్నులు నలుపుకొని "అయ్యా! సోఫాక్లీజులోని దని తమ రేదో యిప్పుడు సెలవిచ్చినారే! అది యందులో నున్నట్లు నాకు జ్ఞప్తిలే" దని చెప్పెను. "సరి!

* వీరు గ్రీక్కుభాషలో నాటకములు వ్రాసినవారు.

సరి! నేఁ జదివినది సోఫోక్లీజులోనిదే యయ్యా! మాటకు మాట తేడా లేకుండ నున్నది. మీరు కాలేజిలోఁ జదివి కొంత కాల మైనట్లున్న" దని బడాయిబాలుఁడు దానికిఁ బ్రత్యుత్తర మిచ్చెను.

అంతట నా పోర్సను పండితుఁడు తనపద్ద చొక్కాలోనికి చేయి పోనిచ్చి జేబులోనుండియొక చిన్నయచ్చు సోఫాక్లీజు పుస్తకమును పైకిఁదీసి, "అయ్యా! దయ చేసి యీవాక్యము నిందులోఁ జూపెదరా"? యని యెంతో శాంతముగా విద్యార్థినడిగెను. అంత నతఁడు కొంత సేపు పత్రము లటు నిటు తిరుగవైచి "అన్నట్టు లయ్యా! అది * యురిపిడీజులోనిది. ఇప్పుడు స్మృతికి వచ్చినది" అని చెప్పెను.

దానికి పండితుఁ డేమియు చలింపక తిరుగఁ జేతిని జేబులోఁ జొనిపి యురిపిడీజుయొక్క చిన్నప్రతి నీవలికిలాగి, చేతఁ బెట్టి "అట్లైన నీచిన్నసంచికలో నది కనఁబడవచ్చును. దయ చేసి చూపుఁ" డని చెప్పెను, యథాప్రకారము విద్యార్థి పుస్తకపుఁ గాకితములు త్రిప్పిత్రిప్పి చూచెను గాని, యత్నము విఫల మయ్యెను. ఎవరి మెప్పునకై యంత చేయుచుండెనో యీ యువతీమణులే, యవన్నియు సొఱకాయ కోఁతలుగదా యని తెలిసికొని లోలోపల నవ్వుకొనుచుండిరి, నవ్వాఁచుకొన లేక యందులోఁ గొందఱు కిచకిచలాడిరి. ఉపాయాంతరము గాన్పింపమి నా యువకుఁడు తుద కిట్లనియె "అయ్యయ్యో! ఎంత మందమతి నైతిని, ఔను! ఔను! ఇప్పుడు బాగుగా జ్ఞప్తికి వచ్చినది, అది * ఎస్కిలసులో నున్నది." ఇంతటితో నైనను

---

* వీరు గ్రీకుభాషలో నాటకములు వ్రాసినవారు.

పోనీయవచ్చునా, పండితుఁడు? అతఁ డట్లుచేయక, అఱియ తూణీరమునవలె నుండు నా జేబులోనే మఱలఁ జేయి ప్రవేశ పెట్టి యెస్కిలను ప్రతినూడఁబెఱికి విద్యార్థి చేతి కీయఁబోఁగా నతఁ డాశ్చర్యపడి, కలవరముతో "ఏమోయీ! బండివాఁడు! బండి యాఁపు! వెంటనే యాఁపు! నన్నుఁబోనిమ్ము త్వరగా నావలఁ బోనిమ్ము! కానంత చొక్కా జేబులో గ్రంథజాల మంతయు నిముడుచుకొన్న యసాధ్యుఁ డొకఁ డిటనున్నాఁ"డని బిగ్గరగా నఱచెను.

---

# 6. ఏనుఁగు.

## మొదటి భాగము.

ఏనుఁగు ఏషియా ఖండమందును ఆఫ్రికాఖండమందును నుండును. ఏషియా ఖండమందలి యేనుఁగు, సింహళము, సుమత్రా, బోర్నియో మొదలగు ద్వీపములయందును, బర్మా సయాము, మొదలగు దేశములందును, హిందూదేశమున - అస్సాములోను, హిమవత్పర్వత ప్రాంతములందును నుండును. వేసఁగిలో వెదురుడొంకలును, చెట్లును, నీటివసతియుఁ గల యరణ్యప్రదేశములం దుండి, వర్షాకాలమం దప్పు డప్పుడు బయళ్లకు వచ్చి పచ్చిక మేయుచుండును.

ఏనుఁగు కనఁబడినతోడనే యదివఱకు దాని నెఱుఁగని వాఁడు దాని యొడ్డుపొడుగునుచూచి యాశ్చర్యపడును. స్థల చరములలో ఏనుఁగు పెద్దజంతువు. మగయేనుఁగు తొమ్మిది యడుగు లెత్తు పెరుఁగును. ఆఁడేనుఁ గెనిమిది యడుగులుండును. ఏనుఁగు తలపెద్దది. చెవులు చేటలవలె నుండి యిటు నటు

నాడించుటకు వీలుగా నుండును. మెడ లావుగా పొట్టిగా నుం డును, కన్నులు చిన్నవి. కాళ్లు స్థూలములు పాదములు పెద్దవి.



ముక్కు పొడుగుగా పెద్ద రోఁకలివలె నుండును. దీనికి తొండ మని పేరు. మనకు చేయి యెట్లుపయోగపడునో దానికి తొండ మట్లుపయోగపడును. కనుక హస్తకర శబ్దము లేనుఁగుతొండ మనికూడ నర్థ మిచ్చును. కరముగలది గనుక కరి యనియు, హస్తము గలది గనుక హస్తియనియు నేనుఁగునకుఁ బర్యాయపదములు. చివర రెండు ముక్కురము లుండును. వీనిలోనికి నీటిని బీల్చుకొని యేనుఁగు నోటఁ బోసికొనును. ముందు తొండముతోఁ ద్రాగి తరువాత నోటితోఁ ద్రాగును, కాన, నేనుఁగునకు ద్విప మనియు ననేకప మనియుఁ బేళ్లు. ద్విప మనఁగా రెంటితోఁ బానము చేయునది. అనేకప మనఁగా నొకటికంటె నెక్కువ యవయవములతోఁ ద్రాగునది.

తొండముతో వృక్షశాఖలు విఱిచి నోటనుంచుకొనును. తొండమునకు వ్రేలివంటి యొక యగ్రము కలదు. అది యేనుఁగునకు నున్నితమైన ఘ్రాణేంద్రియముగాను స్పర్శేంద్రియము గాను గూడ నుపయోగపడును. సూది వంటి చిన్నవస్తువులను సైతమది దానితో నెత్తఁగల దని చెప్పుదురు. కాని దానిఘ్రాణేంద్రియమును చక్షురింద్రియమును అంతచురుకైనవి గావు.

సాధారణముగా మగయేనుఁగు లన్నిటికిని, ఆఁడేనుఁగులలోఁ గొన్నిటికిని, హస్తమూలమున కిఱుప్రక్కలను స్ఫుటముగా గాన్పించు రెండు పొడుగులైన దంతము లుండును. అందుచేతనే యేనుఁగును ద్విరద మనియు దంతి యనియు నందురు. ద్విరద మనఁగా రెండుదంతములు గలది. దంతి యనఁగా (స్ఫుటమైన) దంతములు గలది. మిగిలిన జంతువులు కొమ్ముల నుపయోగించుకొను నట్లేనుఁగు దంతముల నుపయోగించుకొనును. కనుక వానికి కొమ్ము లనికూడఁ బేరు. మగయేనుఁగులను కొమ్ముటేనుఁగు లందరు. పైకిఁ గానిపించు ఈ దంతములుగాక యితరజంతువులకువలెనే యేనుఁగులకుఁగూడ లోపల తక్కిన పండ్లుండును. ఏనుఁగుదంతములు నగిషీపనికి మిక్కిలి యుపయోగించును.

ఏనుఁగు తోఁక చివరను, కఱకు వెండ్రుకలు కొంచెముగా నుండును.

ఏనుఁగులు నల్లగా నుండును. కొన్నిటికిఁ దొండము మీఁదను, నొసటను,తొండము మొదటను, చెవులయొద్ద గొంచెము ఎఱ్ఱని పొడ లుండును. శరీరముమీఁద రోమము లుండవు.

---

యాకర్షించి వాని లోఁబడవేసి బంధించుట మూఁడవమార్గము. ప్రత్యేకముగా వేఁటకై తయారుచేసిన మచ్చిక యేనుఁగుల మీఁదఁబోయి నేర్పుతో ఉచ్చులువేసి బంధించి తెచ్చుట నాల్గవమార్గము.

హిందూదేశపు ఏనుఁగుకంటె నాఫ్రికాఖండపు ఏనుఁగు పెద్దది. అది పదియడుగుల యెత్తుండును. చెవులును గన్నులును బెద్దవి. నొసట యెక్కువ గోడిగా నుండును, కరాగ్రములు రెండుండును. దేహచ్ఛాయ యెక్కువ నలుపు. వీఁపుపల్లముగా నుండును. సాధారణముగా మగయేనుఁగులకును ఆఁడేనుఁగుల కును గూడ దంతము లుండును.

ఏనుఁగుమీఁద నంబారికట్టి కూరుచుండి రాజు లూరేగు దురు. యుద్ధభూములను దానిచే బరువులు మోయింతురు. దానిమీఁద నెక్కి వెళ్ళి పెద్దపులులను వేఁటాడుదురు.

---

## 8. శతకములలోని పద్యములు.

చ. సమయమునకు స్ఫురించుటకుఁ
జాలనివిద్యయుఁ గాననప్రదే
శమున వెలుంగు వెన్నెలయు
శాస్త్ర మెఱుంగని వైద్యుఁడున్ రణ
క్షమ నెదిరింప లేనిభుజ
శక్తిపటుత్వము రాజు లేనిరా
ష్ట్రమును నిరర్థకంబు రఘు
రామ ! దయాహృదయా ! శుభోదయా !

ఉ. ఇమ్ముగ వంశమందు నొకఁడేని వరిష్ఠుఁడు సంభవింప వం
శమ్మున కెల్ల యోగ్యత ఘటించును! సరణ్యమునం బటీరవృ
క్షమ్ము జనించెనేని ఘన సౌరభ మవ్వనమందు నెల్లెడన్
గ్రమ్మినరీతిగాఁ గరఘురామ! దయాహృదయాశుభోదయా

క. అడిగిన జీతం బీయని,
మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుటకంటెన్
వడి గలయెద్దులఁ గట్టుక,
మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ! 3

క. అక్కఱకు రాని చుట్టము,
మ్రొక్కిన వరమీనివేల్పు మోహరమునఁ దా
నెక్కినఁ బాఱని గుఱ్ఱము,
గ్రక్కున విడువంగవలయుఁ గదరా సుమతీ! 4

క. అప్పుగొని చేయు విభవము,
ముప్పునఁ బ్రాయంపుటాలు, మూర్ఖుని తపమున్,
దప్పరయని నృపు రాజ్యము,
దెప్పరమై మీఁదఁ గీడు దెచ్చును సుమతీ! 5

క. అప్పిచ్చువాఁడు, వైద్యుఁడు;
నెప్పుడు నెడతెగక పాఱునేఱును ద్విజుఁడున్,
జొప్పడినయూర నుండుము;
చొప్పడ కున్నట్టియూరు చొరకుము సుమతీ; 6

క. ఉత్తమగుణములు నీచున
కెత్తెఱఁగునఁ గలుగనేర్చు నెయ్యెడలం దా
నెత్తిచ్చి కరఁగి పోసిన
నిత్తడి బంగార మగునె యిలలో సుమతీ! 7

ఆ. అరయఁ దఱచు జేగడ ʃ మాడిపీవారిండ్లఁ
దలఁగ కేల లక్ష్మి ʃ నిలిచియుండు ?
నోటికుండ నీరు ʃ నుంచిన నిలుచునా ?
విశ్వదాభిరామ ʃ వినుర వేమ ! 8

ఆ. అల్పుఁ డెపుడుబల్కు ʃ నాడంబరముగాను
సజ్జనుండు పలుకుఁ ʃ జల్లగాను ;
కంచు మ్రోగునట్లు ʃ కనకంబు మ్రోఁగునా ?
విశ్వదాభిరామ ʃ వినుర వేమ ! 9

ఆ. అంతరంగమందు ʃ నపరాధములు చేసి
మంచివారివలెను ʃ మనుజుఁ డుండు;
నితరు లెఱుఁగకున్న ʃ నీశ్వరు డెఱుఁగఁడా ;
విశ్వదాభిరామ ʃ వినుర నేమ ! 10

ఆ. ఇనుము విఱిగెనేని ʃ యినుమాఱు ముమ్మాఱు
కాఁచి యతుకవచ్చు ʃ గ్రమముగాను ;
మనసు విఱిగెనేని ʃ మఱి చేర్చ రాదయ్య
విశ్వదాభిరామ ʃ వినుర వేమ ! 11

ఆ. ఆపద యగువేళ ʃ నరసి బంధులఁ జూడు
భయమువేళఁ జూడు ʃ బంటుతనము;
పేదఱిమిని జూడు ʃ పెండ్లాము గుణమును;
విశ్వదాభిరామ ʃ వినుర వేమ ! 12

---

## 9. రాజు, అతనిపుత్త్రులు.

ఒక రాజునకు కొందఱు పుత్త్రులు గలరు. వారిలోనొక్కఁడు వామనస్వరూపుఁడు, కురూపి. మిగిలినవారు దీర్ఘకాయులు,

సుందరులు, రాజలక్షణయుక్తులు. సుందరస్వరూపు లగుపుత్త్రులను రాజు మిగులఁ బ్రేమించుచుండెను. వక్రదేహుఁ డగు పుత్త్రుని వెగటుగఁ జూచుచుండెను. తనతండ్రి తన్నేవగించుచున్నాఁ డని సూక్ష్మబుద్ధితోఁ గనిపట్టి యాకుబ్జుఁడు తండ్రియొద్ద కేగి యి ట్లనియెను. "నాయనా! పొట్టివాఁ డగు బుద్ధిమంతుఁడు, పొడుగువాఁడగు బుద్ధిహీనునికంటె ఘనుఁడు కాఁడా? పురుషునికి ఘనత నొసఁగునది తెలివికాని దేహస్థౌల్యము కాదుగదా! స్వరూపమునఁ బెద్ద దగుమాత్రమున వస్తువు ప్రశస్తమైనదని చెప్పవచ్చునా? మేఁక యెక్కడ! ఏనుఁ గెక్కడ? మేకమాంసమును భుజించి, యారోగ్యమును గాంచుచున్నాము. ఏనుఁగుమాంసమును స్పృశింపనైన స్పృశింపము. 'గొఱ్ఱె భోజ్య, మభోజ్యము కుంజరంబు' అను కవివాక్యము మీ రెఱుఁగనిది కాదు 'సినే' యను పర్వత మన్నిటిలోఁ జిన్నకాని మహత్త్వములో నుత్కృష్ట మని పెద్దలు చెప్పిరి కాదా?

బలములేని యరేబియా • వారువంబు
గాడిదలదండుకంటెను • ఘనముగాదె?

యనుచుఁ గృశరూపుఁ డగు మేధావంతుఁడు, బుద్ధిహీనుఁ డగు పొత్రపురాతివంటి వానితో ననియె నని మీరు వినియే యుందురు."

అతనిమాటలు విని రాజు నవ్వెను. రాజసభలో నున్న యుద్యోగులు బళి యనిరి. కాని యాతని సోదరులుమాత్ర మాగ్రహయుక్తులైరి.

పై స్వరూపమును బట్టి మనుజుని గణింపఁదగునా? ఎవరి

బుద్ధియెంత విశేషమైనదో! పొద లన్నియు నట్టి వనవచ్చునా? ఏపొదలో పులి పొంచియుండునో!

ఆసంవత్సరమే యా రాజున కొక మహాబలుఁ డగు శత్రునితో యుద్ధము పొసఁగెను. వక్రదేహుఁడగు పుత్త్రుఁడే రణరంగమున ముందుగ నుఱికి ధైర్యశాలులగు కొందఱు యుద్ధభటుల వధించి యుద్ధభూమియందు నిల్చియున్న తండ్రియొద్దకు వచ్చి సాష్టాంగపడి "నాయనా మీకంటికి నేను రోఁతగ నుంటినని యెఱుఁగుదును. కాని శరీరసౌభాగ్యమే సర్వోత్కృష్టమని యెంచఁదగదు. సన్నని నడుముగల గుఱ్ఱము యుద్ధభూమిలోఁ బనికివచ్చునుగాని పలక వీఁపుగలయాఁబోతు పనికివచ్చునా ? ఈమాటలు పలికి తండ్రియొద్ద సెలవుతీసికొని తిరుగ యుద్ధము ముమ్మరముగ జరుగుచున్నచోటికి ఱివ్వునఁ బరువెత్తెను.

రాజసేన లల్పసంఖ్యగలదై యుండెను. శాత్రవసైన్యములు మహాబలయుక్తములై యధికసంఖ్య గలవి యై యుండెను. శత్రుసైన్యములధాటి కాఁగలేక రాజసైన్యములు క్రమక్రమముగ వెనుకకు జంకిజంకి తుదకుఁ బ్రాణములను రక్షించుకొనుటకై పరువెత్త నారంభించెను. అంతట హ్రస్వరూపుఁడగు రాజపుత్త్రుఁ డట్టహాసము చేసి రణసీమ యదరునట్లు బొబ్బలు పెట్టెను. శూరులారా! పాఱిపోకుఁడు! పాఱిపోకుఁడు! ఇక్కడఁ జచ్చి యింటిలో బ్రతుకుదురా? శరీరధారికిఁ జావెక్కడనైన నున్నదే. పౌరుష మగపఱచుచు రాజవిశ్వాసయుక్తులై రణరంగమునఁ జచ్చు మహాభాగ్యము నొందవలదా ? తిరుగుఁడు! తిరుగుఁడు ! కత్తులునూని గరిఁటెలు చేఁబూనఁదలఁచినారా? కవచములుతీసి ఱవికలు సింగారించు

కొందురా ? పాఱిపోయివచ్చి మీసములుగల మిమ్ము మీ సతులు గౌరవింతురా ?''

ఈపోటుమాటలు విని పాఱిపోవుచున్న సైన్య మంతయు నొక్కపెట్టునఁ దిరుగ శత్రువునిఁ దాకెను. సైన్యమునకు మొదటఁ గత్తిని ధరించి యాబాలుఁడు ప్రకాశించుచుండెను. వీరావేశమును గలిగించుచు శత్రుసేనమధ్యమునకుఁ దనసైన్యమును దీసికొనిపోయెను. దైవకటాక్షమున నా శత్రుసేన నోడించి జయముగాంచెను. తండ్రియొద్దకేగి నమస్కరించినిలువఁబడెను.

తండ్రి యాతనిఁ గౌఁగిలించుకొని ముద్దిడి యాదరించి కొలఁది దినములలో నాతనికి యౌవరాజ్య పట్టాభిషేక మొనర్చెను.

ఆతనియగ్రజు లసూయనొంది యాతనియన్నములో విషము పెట్టించిరి. ఈసుట్టు యాతని సోదరియొక తెయొఱిఁగియాయన్నమును భుజింపవలదని సంజ్ఞ చేసెను. ఆతఁ డా యాహారముల విసర్జించి యాసంగతి తండ్రితో మనవిచేసికొనెను. తండ్రి వారిని బిలిచి కఠినముగ నిందించి వారికిఁ గొన్ని కొన్ని గ్రామములు పంచియిచ్చి వేఱుగ నుంచెను.

పదుగురు సన్న్యాసులొక్కకంబళిలో గాఢనిద్రనొందఁ గలరుఁ కాని, యిద్దఱు రాజు లొక్కరాష్ట్రములో శాంతిగ నుండలేరు. దైవభక్తుని కెవఁడైన నొకరొట్టె యిచ్చినయెడల దానిని రెండుభాగములుచేసి యొకసగము బీదవానికిచ్చి మిగిలినది తాను భుజించును. ఏడుద్వీపములకుఁ బ్రభుఁడైన సార్వభౌముఁడన్ననో, గెలుచుట కెనిమిదవ దేదైననున్నదాయని దేవులాడుచు నుండును.

# 10. శివాజి.

## మొదటి భాగము.

హిందూదేశము సారవంతమైనదియు ధనవంతమైనదియుఁ గాఁబట్టి విదేశీయులు దానిమీఁదికి దండెత్తివచ్చుట తటస్థించెను. ఆయాకాలములయందుండు స్వదేశప్రభువుల యన్యోన్యకలహములచేతను, స్వార్థపరత్వముచేతను, దేశాభిమానశూన్యత చేతను, బంగారమువంటి దేశ మతిసులభముగఁ బరరాజుల పాలగుచుండెను.

తఱచీరీతిగా నుండినను, శూరశిఖామణు లప్పుడప్పు డుదయించి తమ తేజోమహిమచేఁ బరరాజ్యపీడనుండి ప్రజలఁ గాపాడుచు వచ్చిరి. అట్టివారిలో అగ్రగణ్యుఁడు శివాజీయను మహారాష్ట్ర వీరపురుషుఁడు.

దక్షిణహిందూదేశముయొక్క పశ్చిమభాగమునకుమహారాష్ట్రమనియు దానిసముద్రపుటంచునకు కొంకణ మనియుఁ బేర్లు.

పర్వతాకీర్ణ మగు ప్రదేశమగుటచే నీకొంకణమునఁ బూర్వకాలమందు రోడ్లు విశేషముగా లేవు. అక్కడక్కడ పర్వతముల మీఁదనున్న బలమైన కోటలు పరబలములకు దుర్గమములుగ నుండెడివి.

శివాజీ జన్మకాలమున హిందూదేశపు టుత్తరభాగము మొగలులకును, దక్షిణభాగము పఠాణవంశజు లగు కొందఱు నాయకులకును అధీనమై యుండెను. అనఁగా దేశమంతయు దరిదాపుగా మహమ్మదీయులచేతిలో నుండె నన్నమాట.

అక్కడక్కడఁ బ్రజారంజకులైన అక్బరువంటి చక్రవర్తు

లుండినను, మొత్తము మీఁద మహమ్మదీయ పరిపాలనలో హైందవులు చాల బాధపడుచుండిరి.

ప్రభువులయొద్దఁ బెద్ద యుద్యోగములలో నున్న కొందఱు హైందవులకు ధనలాభ మున్నను ఉండుఁగాక, జనసామాన్యమునకు మతసంబంధమైన యిబ్బందులును అవమానములును హెచ్చుగా నుండెను

కొల్లగొట్టుట, విగ్రహముల నఱకి పడవైచుట, పవిత్ర స్థలములు నాశముచేయుట, బలవంతముగ హిందువుల మహమ్మదీయ మతములోఁ బ్రవేశపెట్టుట. స్త్రీలఁ జెఱపట్టుట, మతాంతరుల పై జిజియాపన్ను వేసి వసూలుచేయుట, గోబ్రాహ్మణులను పీడించుట—ఇట్టి కృత్యములు హైందవులకు దారుణములు గను అసహ్యములుగను ఉండెను. పైకనుటకు జంకినను పెక్కురు "మమ్మీ యుపద్రవమునుండి తొలఁగించి రక్షించు మహానుభావుఁ డెప్పుడైన జన్మించునా" యని వేగురు వేల్పులకు నిత్యమును మ్రొక్కుకొనుచుండిరి.

ఇట్లుండ, శివనేరు దుర్గమున 1627-వ సం॥ మేనెలలో అక్షయసంవత్సర వైశాఖ శుద్ధ పంచమినాఁడు షాజీకిని జిజాబాయికిని శివాజీ యను మహాపురుషుఁడు జన్మించెను.

శివప్రసాదముచేఁ గలిగినందున శివాజీ యని పేరు వచ్చినదని కొందఱును, భవానీభక్తుఁడగుటచే నట్టినామము వచ్చినదని కొందఱును జెప్పుదురు. ఏది యెట్లున్నను, శివాజీ అసాధారణ ప్రజ్ఞావంతుఁడుగాని సామాన్యుఁడు మాత్రముగాఁడు.

ఇతనికి ఏకగర్భజనితుఁడైన శంబాజీ యను అన్న యొకఁడును, వెంకోజీ యను సవతితమ్ముఁ డొకఁడును గలరు.

తండ్రియైన షాజీ తురుష్కులకొలువులో ఉన్నతపదముల యందుండి యనేకములైన జాగీర్లుసంపాదించి వారికినమ్మినవాడై మెలగుచుండెను. అది దేశాభిమానినియు శూరురాలును అగు జిజాబాయికి గిట్టినది కాదు. అదియుఁగాక, షాజీ కొలువున్న బిజాపూరు సంస్థానమునకును మోగలులకును పోరు జరుగు చున్నప్పుడు జిజాబాయియు ఆమెబిడ్డఁడగు శివాజీయును మోగలులచేతిలోఁ జిక్కి, చివరకుఁ దప్పించుకొన్నను, మిక్కిలి బాధ నొందిరి. ఇట్టికారణములచే ఆవిరమాతకు తురుష్కుల మీఁద మిక్కిలి యాగ్రహము జనించెను. తన బిడ్డను పెంచి పెద్దవానిని జేసి మహమ్మదీయులపై గత్తి కట్టించి వారివారి నుండి దేశమును దప్పించుఅభినివేశముతో నామె యుండెను.

పెద్దకొడుకగు శంభాజీని కూడ నుంచుకొని, షాజీ తన భార్యను శివాజీని వదలివేసెను. అంతేకాక యాతఁడు తుకా బాయి యను రెండవస్త్రీని పెండ్లి చేసికొనెను. సతీపతులకు పడకపోవుట కభిప్రాయభేదములే కారణము గాని మఱి యొండు గాదు.

ఇట్టిస్థితిలో జిజాబాయి ధైర్యమును దెచ్చుకొని తనబిడ్డనికి క్షాత్రధర్మము లుగ్గుఁబాలతో నుపదేశించి సహజముగానున్న తురుష్కద్వేషబీజముల నంకురింపఁ జేసెను. మహమ్మదీయుచాల నారిష్టములును పూర్వులగు నుత్తమక్షత్రియుల శూరకృత్యములును, ధర్మస్థాపనములును, గోబ్రాహ్మణసంరక్షణావశ్యకతయును, ప్రతిదినమును గుమారునకు నూరిపోయుచుండెను. కావున దేశమతాభిమానమును ధైర్యస్థైర్యములును ఉప దేశించుటలో శివాజీకి కన్నతల్లియే ప్రథమగురువు

కొంతకాలము తరువాత, షాజీ, సయీబాయియను నామెను శివాజీకి వివాహముచేసి వారిని జిజాబాయితోఁదనజాగీరులలో నున్న పునహాపట్టనమునకుఁ బంపెను. వారిని సంరక్షించుటకును తనజాగీరుల పని చూచుటకును వారివెంట దాదోజీకొండ దేవుఁడను నొక సద్బ్రాహ్మణుని గుమాస్తాగాఁ బంపెను.

---

# 11. శివాజీ.

## రెండవ భాగము.

షాజీ విజాపురపు సరదారుగా నుండి యనేక రాజ్యముల నోడించి యనేకములైన జాగీరుల నార్జించి ద్వితీయభార్యా పుత్రుఁడును తనకధిక ప్రేమాస్పదుఁడును అగు వెంకోజీకివిపుల మగు తంజావూరుసంస్థానము నిచ్చెను. ఇచ్చి పునహాప్రాంతపు జాగీరులనుండివచ్చిన రాబడితోఁ దనప్రథమభార్యను శివాజీని పోషింపుమని కొండదేవునకు వ్రాత్రపంపెను. కాలక్రమమునఁ బెద్దకొడుకగు శంభాజీ తురుష్కులచే హతుఁడయ్యెను.

దాదోజీ శివాజీకి ద్వితీయగురువు. ఇతఁడు వ్యవహార నిపుణుఁడైన మంచి ముసద్దీ. పునహా మొదలగుజాగీర్లమీఁద వచ్చురాబడి నెన్నోమడుఁగులు హెచ్చుచేసెను. జమాబంది మొదలగు పరిపాలనపద్ధతులను శివాజీకి బోధించి తగుపాటి విద్య నేర్పెను. ముఖ్యముగా ధనుర్విద్య, తుపాకివేఁత, అశ్వా రోహణము, సాము, ఖడ్గప్రాసాదులతో పోరాడుట మొదలగు నెన్నో యుద్ధకళలను గఱపెను. ఈవిషయములో కృపద్రోణులు పాండవుల కెట్లో దాదోజి శివాజీకట్లు. తల్లి శత్రుజయా పేక్ష పుట్టించెను. దాదోజీ శివాజీకి దానికిఁదగినసామర్థ్యమును



నై పుణ్యమును గలుగజేసెను. దాదోజీయొక్క యసమాన శిక్షయే శివాజీ భావి జయములకు ముఖ్యకారణము. హరికథ లన్నను పురాణము లన్నను శివాజీకి మిక్కిలి యిష్టము. అంగలి వీరపురుషుల చారిత్రములు వినినకొలందిని ఒడ లుప్పొంగు

చుండెను. వారివలెఁ దానును శౌర్యమును జూపి దుష్టశిక్షణము ను శిష్టరక్షణమును జేయవలెననువాంఛ తీవ్ర మగుచుండెను.

భక్తాగ్రగణ్యుఁ డగు తుకారాముని తనకు జ్ఞానోపదేష్టగా నుండు మని పెక్కుకానుకలంపి శివాజీతొలుదొల్తఁ బ్రార్థించె నఁట. దానిమీఁది నతఁడు "నీధనధాన్యములు నాకక్కఱకు రావు. నావంటి యరణ్యవాసునివలన నీకించుకేని లాభము లేదు. నీవు రామదాసునిగురువుగాఁ జేసికొనియభీష్ట సిద్ధినొందు" మని జవాబిచ్చెనఁట. అంతట రామదాసుని గురువుగాఁ జేసి కొని, శివాజీ చరితార్థుఁ డయ్యెను. రామదాసుఁడుగోదావరితీర స్థుఁడు. ఈయన మొదటిపేరు నారాయణుఁడు. తరువాత అఖండ రామభక్తుఁడును సమర్థుఁడును ఐనందున నతనికి 'సమర్థరామ దాసస్వామి' యనుబిరుదువచ్చెను. అతనివలన జ్ఞానోపదేశము నొంది శివాజీ తనసర్వస్వమును గురుదక్షిణగా సమర్పింపఁగా రామదాసుఁ డంతయుఁ దిరుగ శివాజీకిచ్చి, నాకుబదులుగానీవు ధర్మయుక్తముగా రాజ్యమేలుము. నీవు క్షత్రియుఁడవు. క్షత్ర ధర్మములు నెఱపి, శిష్టరక్షణము, దుష్టశిక్షణముచేయుట నీకు విధి యని శ్రీకృష్ణుఁడు సమరభూమిని జెక్కఁగాబోధించి యర్జు నునియుద్ధమునకు బురికొల్పినట్లు శివాజీని ఒప్పించి పంపెను. శివాజీ యప్పటినుండియు రాజ్య మంతయు సన్న్యాసియగు తనగురువుదిగాని, తనది గాదని ప్రకటించుటకై తన జెండాకు జేగుఱుగుడ్డ యుపయోగపఱచుచుండెను. మూఁడవ గురువైన రామదాసుఁడు శివాజీకి కడపటిగురువు. అతని గురుభక్తి యెంతో అతని కాషాయపతాకయే చాటుచున్నది.

శివాజీ జాగీరులలోని దగు మావళవాలోని పర్వతీయులు

మంచి బలమును ధైర్యసాహసములును గలవారు. వారితో నొక గొప్ప కాల్బలమును గుఱ్ఱపుదళమును ఏర్పఱచుకొని శివాజీ, రమారమి యిరువదియేండ్లవయస్సు రాఁగానే శత్రువులగు మహమ్మదీయులపైకి బయలుదేఱెను. ఎంతో ధనము దోఁచుకొని యెన్నో కోటలు పట్టుకొనెను. కొన్నికోటలు క్రొత్తగా కట్టించెను సామాదిచతురుపాయములను ఉపయోగపఱిచి శత్రువులవశపఱచుకొనెను. పెద్దవైభవముతో పట్టాభిషిక్తుఁడై మహారాజయ్యెను. పరాక్రమములో, జిత్తులలో ఇంతటివాఁడు లేఁడనిపించుకొని శత్రులకు భీకరమూరకుఁడై చూపట్టెను.

తండ్రియు దాదోజీయును ప్రభువులగు మహమ్మదీయుల మీఁదఁ గత్తికట్టవలదని యెంత చెప్పినను వినక శివాజీ, మాత్రు ఖోధము నే మనసునం దుంచుకొని యీాళ్లదోఁచుకొని కోటలాక్రమించుకొని విజాపురసంస్థానమును మిక్కిలి చిక్కు పెట్టుచుండెను విజాపురాధినాథుఁడు మొట్టమొదట అలక్ష్యముచేసి యూరకున్నను శివాజీ పెట్టెడుబాధలవిని వానిమీఁదికి గొప్ప సైన్యముతో "అఫ్జుల్లాను"ను బంపెను, ఈయఫ్జుల్లానుఁడే శంభాజీని పూర్వము చేంపెనఁట. అంత సైన్యముతోఁ దనచిన్న సేన పోరాడి గెలుచుట సందేహాస్పదమని తెలిసికొని మాయావియగు శివాజీ భయపడినట్లు నటించి యొంటరిగాదర్శనమిచ్చి మాటలాడినయెడలఁ దాను లొంగెదనని ఖానునకు వార్త పంపెను. అమాయికుఁడగు నఫ్జేల్లానుఁ డదియంతయు నిజమేయనుకొని యట్లుకావించెను. శివాజీ, ఖానుఁడు తన్నుఁగౌఁగిలించుకొన్నప్పుడు, తన చేతిలోదాచుకొన్న పులిగోరు కటారితో

నతనిని పొడిచి చంపెను. అంతట నిక్కడనక్కడ దాఁగియున్న శివాజీసైన్యము ఖానుసైన్యముపైఁ బడి దానిని చెల్లాచెదరు చేసెను.

శివాజీ ధూర్తత్వము దోఁపిళ్లు చూచి భయగ్రస్తుఁడై ఢిల్లీ చక్రవర్తియగు "ఔరంగజేబు" తన దగ్గఱబంధు వగు షైస్టఖానును పెద్దసేనతోఁ బంపెను. అప్పుడుశివాజీ బాఁకుకటిచాకు చేతిలో దాఁచికొని భిక్షుకవేషముతో ఖానుశిబిరములోఁ బ్రవేశించి పైఁబడ, నతఁడు ప్రాణావశిష్టుఁడై గవాక్షములోనుండి యావలికి దుమికి పాఱిపోయెను.శివాజీ నోడింపవచ్చినమాటయే మఱచి యతఁడును సేనయు నదే పోకగాఁ బోయిరి.

తరువాత నొకసారి యౌరంగజేబుచే ఆహూతుఁడై శివాజీ ఢిల్లీకి వెళ్లెను. ఏలాగుననో యాచక్రవర్తి తన్నుఁ బట్టుకొను ప్రయత్నములు చేయుచున్నట్లు శివాజీకి గోచరించెను. తానున్న గృహము బహుశత్రుభటరక్షితమై యున్నను, అదను చూచి తన సేవకుఁడు తీసికొనిపోవుచున్న గంపలోఁ గూర్చుండి మెల్లఁగా నావలఁబడిజుట్టు, గడ్డము, మీసమును గొఱిగించుకొని యొడలి నిండ బూడిదపూసికొని ప్రచ్ఛన్నవేషముతో శివాజీ తనదేశమునకుఁ దిరుగవెళ్లెను.

ఆవల మొగలు చక్రవర్తిని, ఈవల విజాపూరు ప్రభువు మొదలగు మహమ్మదీయ సంస్థానాధిపతులను, ముంతెఁడు నీళ్లు త్రాగించి యోడించి ఛత్రాధిపతియై మహమ్మదీయ రాజ్యముల నుండి "చౌతు" మొదలగు పన్నులను నిరంకుశముగా చిరకాలము వసూలుచేయుచుండెను. శివాజీ యార్జించిన యాధిక్యమును తదనంతరపు వారు కొంతకాలమువఱకు నిలఁబెట్టుకొనిరి.

శూరకులావతంస మగు శివాజీ విజాపురపురాజ్యములోని కోటల నొకటి తరువాత నొకటి పట్టుకొనుచుండఁగా నచ్చోట మహమ్మదీయుల యధికారి యగు ముల్లానా సుబేదారుఁడును, నిరుపమానరూపలావణ్య యగు నతని కోడలును శివాజీ క్రింది సేనాధిపతిచేతిలోఁ జిక్కిరి. ఈసంగతి తెలిసినతోడనే శివాజీ యచటికిఁబోయి జయించిన తనసేనాధిపతిని సుబేదారుగా నేర్పఱచి, ముల్లానాను గౌరవించి తనపురమునకు పోవ సెలవిచ్చెను. సేనాధిపతి, సుందరగాత్రి యగు ముల్లానా కోడలిని తీసికొనివచ్చి యెదుటఁబెట్టి భోగార్థముగా శివాజీ కర్పింపఁ బోఁగా నతఁడు చూచి "అమ్మా! మాతల్లికి నీసౌందర్యమున్నచో నేనెంతసుందరుఁడనై యుందును? ఈమె నాతల్లితో సమానమైనది. యశోభిలాషులు పరస్త్రీని కోరరు. పరదారాభిలాషచే రావణాదులునశించిరి" అని చెప్పియనేకాభరణములు కానుకలిచ్చి సగౌరవముగాఁ గూఁతునట్లు తనవారింటికిఁ బంపిన ట్లామెను విజాపురములో నామెయింటికి పంపివేసెను.

ఇట్టిసద్గుణసముద్రుఁడును అకలంకభవానీభక్తుఁడును అగు శివాజీ, ఫలమంతయు భవానీదేవికే వదలిపెట్టి,నిష్కాముఁడై కేవల ధర్మపాలనార్థమును దేశక్షేమార్థమును బరరాజులతో పోరాడి విజయము నొంది, సర్వజనరక్షణమును స్వమతపోషణమును గావించి యసమాన దేశాభిమానియు మహావీరుఁడు నను శాశ్వతయశస్సు సంపాదించుకొనెను. ఈ మహనీయుఁడు 1608–వ సంవత్సరమున ఏప్రిల్ 5–వ తేదీని రమారమి 53 యేండ్లవయస్సున స్వర్గస్థుఁ డయ్యెను.

———




## 12. పుష్పములు.

వృక్షమునకు కాండమును, వేళ్లు, ఆకులును ముఖ్యభాగము లని యిదివరకుఁ జెప్పియున్నాము. వృక్షమునకు వీనియుపయోగ మది జీవించియున్నంతవఱకే. పుట్టినది చావక మానదు; కనుక, ఎప్పుడో యొకప్పుడు ప్రతివృక్షము చావవలసియున్నది. తరువాత నాయాజాతివృక్షములు తిరుగఁ బుట్టి పెరుఁగక యున్నయెడల వృక్షజాతి లేకపోవుట తటస్థించును. అట్టి లోటులేకుండ భగవంతుఁడు పెక్కుచెట్లకు గింజెలను ప్రసాదించియున్నాఁడు. ఈగింజె లంకురించి మఱలఁ జెట్లగును. ఇట్టి గింజెలకు మూలములైన పుష్పములను గుఱించి మీరిప్పుడు నేర్చుకొనఁబోవుచున్నారు.

సాధారణముగాఁ బుష్పములో నాలుగుభాగము లున్నవి. మొదటిది వృంతచక్రము. వృంతమనఁగా తొడిమ. చక్రమనఁ గుండ్రనిభాగము. లేఁత మొగ్గగా నున్నప్పు డీవృంత

చక్రమే పుష్పమును గాపాడును; కనుక వృంతదళములను రక్షకదళము లనికూడఁ జెప్పవచ్చును. ఇవి సాధారణముగా ఆకులవలె. బచ్చేగానుండును. దళము లంటుకొని యొకటిగా నుండవచ్చును. వేఱువేఱుగా ఉండవచ్చును.

రెండవది వృంత చక్రములోనుండు పుష్పదళచక్రము.కొన్ని టిలో దళములు కలిసికొనిపోవును. కొన్నిటిలో విడి విడిగా నుండును. ఈదళములు నానావర్ణములుగలిగి,తుమ్మెదలు, తేనె యీఁగలు మొదలగు పురుగులను పుష్పముల యొద్దకు ఆకర్షించును గాన వానిని ఆకర్షణపత్రము లని చెప్పుదురు. బొమ్మయందు ఉమ్మెత్తపువ్వులోన భాగము లన్నియు స్పష్ట ముగాఁ జూడవచ్చును.

పుష్పదళసమితి లోపలఁ బైని జీలకఱ్ఱ పాయలవలె సన్నని తిత్తులుగల కాఁడ లుండును. వీనిని కేసరము లని, కింజల్కము లని యందురు. వికసించిన పుష్పములలో ఈతిత్తుల నంటుకొని మెత్తని పరాగ ముండును. దీనినే పుష్పరజ స్సని చెప్పుదురు. పుష్పరజ స్సనఁగా పుప్పొడి. పుష్పము వికసింపక పూర్వ, మీపుప్పొడి, పైఁజెప్పిన సంచులలోపల నుండును. వికసింపఁ గానే యీవలికి వచ్చును. బీజోత్పత్తి కీపుప్పొడి ముఖ్యము. కనుక కింజల్కములయొక్క ముఖ్యప్రయోజనము బీజోత్ప త్తికిఁ గారణమైన పుష్పపరాగము నిచ్చుటయే.

కింజల్కపుంజ మధ్యమునఁ బన్నీటిబుడ్డివంటి యొక దిమ్మె యుండును. దీనినే కర్ణిక యనియు, దుద్దనియుఁ జెప్పుదురు. ఇది పుష్పముయొక్క నాల్గవభాగము. పన్నీటిబుడ్డికివలెనే దీని కడుగున నొక బుడ్డయు, నడుమనొకగొట్టమును, పైని నొక

మూతియు నుండును. ఇందలి పుప్పొడిజాతినప్పుడుగాని,యితర మైన పుష్పరజ స్సిందులోఁ బడినప్పుడుగాని, యది మూతిలో నుండి నాళద్వారమునఁ గ్రింది గర్భాశయమువంటి బుడ్డిలోఁ బ్రవేశించును.

వృక్ష సంతాన వృద్ధికి ముఖ్యాధారము లగు నిట్టిపువ్వులను బశువులు మేయకుండఁగను, పురుగులు పాడుచేయకుండఁగను భగవంతుఁడు చేక్కని యేర్పాటులు చేసినాఁడు. మొగలి గులాబివంటి చెట్లకు ముండ్లు పెట్టినాఁడు. అరఁటివంటి చెట్లకుఁ బువ్వులమీఁద దళసరి దొప్పలు నిర్మించినాఁడు.

---

## 13. సూర్యాస్తమయము.

గీ. పగటితఱి భుక్తికై పాటు పడినపిదప
నలసి వేసంగి నొక్కసాయంబునందు.
జెట్టు లున్నట్టియొక పెద్దచెఱువుగట్టు
పైని నొకచోటఁ; జేతికిలఁబడితి నేను. 1

గీ. భానుబింబము లే; దైనఁబడమటిదెస
యంత, దవ్వుల నంటుకొన్నట్టు పెక్కు
చెట్లసందులనుండి విచిత్ర విపుల
కమ్రరక్తిమ యొక్కటి కానిపించె. 2

క. ఇట్టులె యొకసన్మార్గుఁడు
గిట్టి చేనినపిదపఁ గూడఁ గెరలి యతనిపై
నట్టియకలంకకృతు లిలు,
గట్టుక యిల నుండుఁ బరసుఖములకు ననువై. 3

గీ. ప్రాలెఁ దేజస్వియును లోకబాంధవుఁ డని
ప్రాక్స్రతి మొగంబు చిన్నవోవంగ; నీకు
జిలుఁగుఁ జెంగావి ధరియించి కులుకుచుంట
తగదు తగదమ్మ పశ్చిమగగనకాంత ! 4

కం. బంగరు మలాము చేసిన,
భంగిని గాన్పించెఁ బెక్కుపట్టులఁ జెట్టుల్,
రంగులు గుల్కు తరంగపు,
సింగారముమీఁద నొప్పెఁ జెలువుజలంబుల్. 5

ఆ. చాలఁ బగటఁ బడ్డ శ్రమమంతయును బోయెఁ,
గనుల పండువయ్యె, క్షణముగూడ
స్థిరము గాక. యేఁచు చిత్తంబులో నొక్క
సౌఖ్యజనక మైన శాంతి యొదవె. 6

ఆ. ఇట్టి చిత్రవేళ సృష్టికర్తకు మ్రొక్క
వచ్చి విప్రవరులు సొచ్చి చెలువు,
నర్ఘ్య మొసఁగి రంత నావేదపేటి. కా
యన యొసంగినట్టి యఁబువులనె. 7

గీ. వేఁడుకొన్నది యొక విప్రపతతి కాదు
బారులుగ వచ్చి తరువులపైని వ్రాలి
కావు ! కావు ! మటంచుఁ బల్గాకిమూఁక
లును జగద్రక్షకునకుఁ బ్రార్థనలు సల్పె. 8

---

## 14. పూఁటకూటియిల్లు.

కొండవీటిసీమ బ్రాహ్మణుఁ డొకడు దక్షిణదేశయాత్రకుఁ బోయెను. ఇతఁడు మృష్టాన్నప్రియుఁడు. ఘృతపానసమర్థుఁడు.

అన్నసత్రమని పెద్దయక్షరములతో గోడపై వ్రాసియున్న యింటికేఁగెఁ డన్నార్థియై పోయెను. అన్నము పెట్టుదురాయని సత్రాధికారి నడిగెను. పూఁటకు కాలురూపాయ యిచ్చిన వారికని యాతఁడు బదులు చెప్పెను. అన్నసత్రమని పేరేమి? ఆ అరూపాయ దినమున కపరాధమేమని లోన గొణఁగు కొనుచు క్షుధాతురుఁడై యుండుటచేత నచ్చట భుజించుట కంగీకరించి స్నానముచేసి పట్టుబట్ట గట్టుకొనెను ; ఒడలి హోకాళ్ళలతో, నత్తి గోపీలతో, కాలికార్వాసావచము లతో, ముద్దముద్ద కింగ్లిషుమాటలతో, భుజించుకొన్న యుచ్చ టవిద్యార్థులు పీతాంబరధారుఁ డగు నీ యుత్తరదేశవాస్తవ్యుని గాంచి యనాగరికుని నుత్తరీయుని పల్లెటూరివాఁ డనియు నింగ్లీషు భాషతో నేమెఱుంగఁ డనుకొని నవ్వుకొనిరి. ఈతఁ డానాగరికులబంతి భుజించుట కంగీకరింపక దూరముగ నీమ మునుపటేకు సెమ్మెగ్రీపీడను గూర్చుండెను వంటపూఁటకింటివిస్తరాలా వత్తారు ముంతెడు నీళ్ళనిడ వడ్డించెను. ఒక విద్యార్థి వచ్చి గరిం టెతో నేయి వడ్డించెను.

అంతట నీ బ్రాహ్మణుఁడు లబలబ లాడుచు ఎడమ చేతితో నెత్తినోరు గొట్టుకొనుచు ఏదియోపడినది! ఏదియోపడినదని యుల్లెగిరిపోవునట్లు కేకలుపెట్టెను. పై నుండి నా మేపడినదో యాతని కాలో రాయో పక్షివాతనుచే బడినదో యని సత్ర ములోని జనసంఘమంతయు తహతహలాడిపోయెను, ఏమది! ఏమది! యని యేఁబదివిద్యార్థు లొక్కసారి కేకలు వేసిరి. ఏదో పడినది! ఏదో పడిన ! దని యాతంఁడు మఱింత కేకలు వేసెను. పంక్తికి దూరముగఁ గూర్చుండినాఁడు ; క్రీనీడను

కూర్చుండుటచే బాగుగాఁ గానిపింప కున్నాఁడు; కుడిచేయి ముందునకుఁజాచి యెడమచేతితోఁ గుడిచేతి మణిబంధమును గట్టిగ బట్టుకొని గావు కేకలు వేయుచున్నాఁడు.

ఈ గడబడఁ జూచి భుజించుచున్న విద్యార్థులు పులుసులోనిమునగ కాఁడముక్కల చేతులతోఁ గొందఱును, పెరుఁగు మూఁతులతోఁ గొందఱును, గొంతవిడి పోవుచున్న కూడకట్టులతోఁ గొందఱును, తొందరతో వచ్చి యాతనిచుట్టు మూఁగి "ఏమి పడినదయ్యా"? అని యఱచిరి. ఏదో పడ్డదండి" అని యాతఁడు విలవిల పోవఁ జొచ్చెను. చాఁపిన కుడిచేతిని జాఁపినట్లే యుంచినాఁడు. ఎడమచేతితోఁ గొడిచేతిని బట్టినపట్టు పట్టినట్లే యుంచినాఁడు. ఏడ్చిన యేడ్పు లట్లై యున్నవి. పైనుండి తేలో పులికో చేయో పడి యఱచేతిలోఁ గుట్టినదని విద్యార్థులు నిశ్చయపఱచుకొనిరి. దానిఁ జంపుటకై ఱోటిలోని రోఁకటి బండ నొకఁడు తీసెను. జోడుతో సులభముగాఁ గొట్టవచ్చునని జోడొకఁడు తీసెను.* "వృశ్చికకుట్టుచుక్కలు" నాయొద్ద నున్నవని యొకఁ డింటికిఁ బరువెత్తెను. ఆయింటనున్న గోడదీపముఁ బట్టుకొని కొందఱాతనియొద్దకు నేలచూపులతో నక్కడ నొక్కడుగు, నిక్కడ నొక్కడుగు వేయుచు వచ్చి యాతని చేతిని బరీక్షించి "ఏదో పడినదంటివి. ఏదియు లేదే" యనిరి. నాయనలారా బాగుగాఁ జూడుఁడు" అని విద్యార్థులతో నాతఁ డనెను. "అమ్మా! నీవు కూడఁ జూడు" మని నేయివడ్డించిన యామెనుగూడఁ బిలిచెను. ఇదివఱకు నిశ్చేష్టురాలై యున్న యామె బాగుగాఁ జూచి "నాయనా యేమియు

---

* తప్పు తెలుంగు.

లేదు'' అనెను. "ఏమియు లేదు. కావున నే యింత యేడ్చుచు న్నాను. నేయి, చేతిపై నైచిన నీవే యేమియు లేదనినప్పుడు తినవలసిన నిర్భాగ్యుఁడును నేనేమి కావలసినది?'' అనిగట్టిగాఁ బలికెను. విద్యార్థు లందఱు వికవిక లాడుచుఁ బోయిరి. నేతి వితంతువు నేయి సమృద్ధిగా వడ్డించెను. ఏవస్తువు తక్కువ వైచినయెడల నేమి యల్లరి జరుగునో యని వంటవాఁడు భయపడుచు వడ్డించెను.

---

## 15. ముసలిది-వైద్యుడు.

నేత్రరోగముచే బాధపడుచున్న యొక వృద్ధాంగన యొక వైద్యునిఁ బిలిపించి కొందఱు పెద్దమనుష్యులయెదుటఁ దనకుఁ గన్నులు కుదిరినయెడలఁ గొంతధనము వైద్యున కిత్తుననియుఁ గన్నులు రానియెడల నేమియు నీయ ననియుఁ జెప్పెను. ఆషర తుల కొప్పుకొని వైద్యుఁడు చికిత్స ప్రారంభించెను. ఎటుపోయి ఎటువచ్చునో; ముందు జాగ్రత్తపడుట మంచి దనుకొని వై ద్యుఁడు వచ్చి వైద్యము చేసి, కట్టుగట్టి, ప్రతిదినము నేదో యొక చిన్నసొత్తు నామె గృహమునుండి సంగ్రహించుకొని పోవుచుండెను. ఇట్లు చిరకాలము గడపి యామె యిల్లంతయు గుల్లచేసిన పిదప, దైవానుగ్రహమువలన నామెకుఁ గన్నులు కుదిరెను. ఇంట మిగిలిన దంతయు నాయిల్లాలి కంటఁబడెను.

అంత వైద్యుఁ "డమ్మా నీకిఁక వైద్యమక్కఱ లేదు. కన్ను లు పూర్తిగా వచ్చినవి. నీవు చేసిన యేర్పాటు ప్రకారమునాకు రావలసిన ధనము వెంటనేయి'' మ్మనియడిగెను. ఆమెయట్లు చేయదయ్యెను. పెక్కురోజులు వైద్యుఁడు చూచి, ప్రాణము

విసిగి, న్యాయదాయియొద్ద ఫిర్యాదుచేసెను. అంతట నా న్యాయాధికారి, యుభయులను బిలిపించి యడిగెను. వైద్యుఁడు తాఁ జెప్పవలసినదంతయుఁ జెప్పెను. "ఇదియంతయు నిజేమూ కాదా? నీవు చెప్పుకొనునదేమైనఁ గలదా?" యనివిచారణకర్తమునలిదాని నడిగెను. దాసి కామె యిట్లు సవినయప్రత్యుత్తర మిచ్చె. "న్యాయమూర్తీ! చిత్తగింపుఁడు, ఆయన చెప్పినదంతయు వాస్తవమే, కాని నాకన్నులు కుదిరినవని మాత్రము నాకు నమ్మకము లేదు. ఈయనచికిత్స ప్రారంభించుటకు మున్ను చేఁద, చేఁట్రాడు, గోలుసొకలి, చెంబులు, పళ్లెములు పాత్రలు మొదలగు పెక్కు గృహోపకరణములు, మాయింట నేను జూచెడుదానను. అవియైన నిప్పుడు కనఁబడుట లేదు. నాకు రోగము నిమ్మళించినదియు, లేనిదియు, నేనీయనకీయవలసిన దేమైన్న నున్నదియు లేనిదియు, దేవర వారి చిత్తమునకే విశదము కాఁగలదు! విచారణ మనావశ్యకము

ఈ మాటలు విని జరిగిన యావన్యాయముఁ దెలిసికొని ప్రాజ్ఞుఁడైన యా ప్రాడ్వివాకుఁడు 'ఆమె దీసికొని రావలసిన తగవు సిగ్గులేగ నీ వెట్లు తెచ్చితి" వని వైద్యుని జీవాట్లుపెట్టి పంపివేసెను.

గుడిలోనిలింగము మ్రింగువాఁడొకఁడుండఁ, గుడియంతయు మ్రింగువాఁడు మఱియొకఁ డుండును. చెఱుపకురా, చెడెదవు.

## 16. రాసులు.

ఆకాశమునందు సూర్యచంద్ర గతులను జూపునక్షత్రపథమును మనపెద్దలు 27 భాగములుగాఁ జేసినారని యితః

పూర్వము వ్రాసియుంటిమి. ఈనక్షత్రమార్గమునే పండ్రెండు భాగములుగాఁ జేసి యొక్కొక్క భాగమందలి నక్షత్రముల యాకారమునుబట్టియొక్కొక్క పేరు పెట్టియున్నారు. మేషము వృషభము మొదలగునక్షత్రసముదాయములనే రాసులందురు. గొర్రెవలెఁ గనఁబడు నక్షత్రరాశి మేషము. ఎద్దువలె నుండు




నది వృషభము. ఇట్లే సింహామువలె నుండునది సింహాము. మీనమువలె నుండునది మీనము. పై బొమ్మను, చివరనుండు ఈపాఠముయొక్క అనుబంధమును జూచుకొనుఁడు.

భూమి సూర్యు నొక సంవత్సరములో చుట్టివచ్చునుగాన, సూర్యుఁడుసంవత్సరములో ఈపంౘెండురాసులను దిరిగివచ్చు చున్నట్లగపడును. ఒక్కొక్కరాశియందొక్కొక్క నెలయుండును. ఏరాశియందు, సూర్యుఁడుండిన, ఆరాశిపేరు, సౌరమానమునుబట్టి ఆనెలకు వచ్చును. సూర్యుఁడు మేషమందుండిననెలకు మేషమాస మనియు, ధనుస్సునం దుండిననెలకు ధనుర్మాసమనియు, మకరమం దుండిననెలకు మకరమాసమనియుఁ బేర్లు పెట్టినారు. చాంద్రమానమునుబట్టి మాసములకుఁ జైత్రాది నామములు వచ్చినవి. దాదాపుగా మేషమాసము వైశాఖమాసమునకు సంబంధించి యుండును. ఇట్లె మిగిలిన పదిమాసములును ఉభయమాసములను బట్టి సరిపుచ్చుకొనవలయును.

సంక్రాంతి యన్నను సంక్రమణమన్నను లెస్సగా నాక్రమించుట యని యర్థము. అనఁగా సూర్యుఁ డొకరాశి విడిచి తరువాతి రాశి నాక్రమించు నన్నమాట. సూర్యుఁడు మీనమును విడిచి మేషములోనికి జొరఁబడురోజున మేషసంక్రమణమందురు. మిథునమును విడిచి కర్కటకమునఁ బ్రవేశించు రోజునఁ గర్కటక సంక్రాంతి యందురు. ఇది జూలై నెలలో బదునేనవ తేదీ ప్రాంతమున వచ్చును. ధనుస్సును విడిచి మకరములోఁబ్రవేశించు దినమున మకరసంక్రాంతి యని చెప్పుదురు. ఇది జాన్యుఅరి పంౘెడవ తేదీప్రాంతమం దగును.

ఇరువదియేడు నక్షత్రసమూహములు గల మార్గమును బంౘెండురాసులు గల మార్గముగాఁ జేసినారని చెప్పితిమిగదా! అనఁగా తొమ్మిదినక్షత్రగణములను నాలుగురాసులుగాఁ జేసి

నారన్న మాట. కనుక నొక్కొక్క రాశియందు రెండుంబాతిక నక్షత్రగణము లుండును. అశ్విని భరణి నక్షత్రములును కృత్తికలో నాల్గవవంతును గలిసి మేష రాశియగును. కృత్తికలో మిగిలిన మూఁడుపాదములును రోహిణియు మృగశిరలో రెండు పాదములును గలిసివృషభ మగును. ఇట్లే తక్కిన రాసులలోని నక్షత్రములనుపై బొమ్మసాహాయ్యమునఁ దెలిసికొనవలయును. సూర్యుఁడొక్కొక్క రాశియందొక్కొక్క నెలయుండునుగదా! కనుక నొక్కొక్క నక్షత్రమందు దాదాపు పదుమూఁడు రోజు లుండును.

సూర్యుఁ డేనక్షత్రమందున్న నానక్షత్రము పేరు కార్తెయగును. వేసఁగిలో సూర్యుఁడు కృత్తికయందును రోహిణియందును ఉన్నప్పుడు కృత్తిక కార్తెయనియు, రోహిణికార్తెయనియు నందురు. కృత్తికకార్తెనే కత్తెరయందురు. ఇట్లే మిగిలినయిరువదియైదు కార్తెలును గ్రహించుకొన వచ్చును. మృగశిర కార్తెలో వర్షములు కురిసి భూమి చెల్లఁబడుటకుఁ బ్రారంభించును. దానిని తరువాత పదునొకండు కార్తెలలోను వర్షములు కొలఁదిగనో గొప్పగానో కురియుచునే యుండి విశాఖతో ఆఁగిపోవును. విశాఖాంతమందు మేఘములును బ్రసూత్యంతమందు యౌవనమును బోవు నని చెప్పు నొక చమత్కారశ్లోకము గలదు. తులామాసములో శీత మారంభించి మీనమాసమువఱకు నుండును.

భూమి సూర్యునిచుట్టు తిరిగివచ్చుటకు దాదాపుగా 365 రోజులు పట్టును. సౌరమానప్రకారము సంవత్సరమునకు రోజులు 365 పై చిల్లర.

ఒక నక్షత్రమునొద్ద నుండి తిరుగ నానక్షత్రము నొద్దకే చంద్రుడుఁ వచ్చుటకు సుమారు 27 రోజులు పట్టు నని వెను కటి వాచకపుస్తకములలోఁ జెదివియున్నారు. కాని పూర్ణిమ మొదలు పూర్ణి మవఱకు దాదాపుగా 29½ రోజులు. ఏదియో యొక మాసము పుచ్చుకొందము. ఆశ్వయుజ పూర్ణిమనాఁడు చంద్రుఁ డశ్వినీనక్షత్రముతో నుండును. కార్తికపూర్ణిమనాఁడు కృత్తికానక్షత్రముతో నుండును. అనఁగా అశ్విని దాఁటిదాని తరువాతి నక్షత్రమును దాఁటి కృత్తికలోఁ బ్రవేశించినాఁడన్న మాట. చంద్రుఁడొక్కొక్క నెలలో 27 నక్షత్రములను చుట్టి వచ్చుటయేకాక, పైఁగాసుమారు 2½ నక్షత్రములు దాఁటును. కనుక నెలలో 29 రోజు లుండును.

పై దానివలనఁ చాంద్రమానముప్రకారము సంవత్సరము నకు రమారమి 354 రోజులు. సౌరమానప్రకారము రమా రమి 365 రోజులు గదా! ఈ రెంటికిని సంవత్సరమున కుండు దరిదాపు 11 రోజుల తేడా కూడఁదీసి రెండు మాసములను సమీకరించుటకై జ్యోతిషికులు మూఁడు సంవత్సరముల కొక సారి అధికమాసమును బెట్టినారు.

---

## 17. వేదవ్యాసుని జన్మము.

యమున యను నదిగట్టున నొక బెస్తపల్లెకలదు. ఆపల్లె కొక యధికారి యుండెను. అతని పేరు దాశరాజు. ఆపల్లె టూరిలోని జనులా యమునానదిలోని చేఁపలను బట్టి యమ్ముకొని జీవించుచుండెడి వారు. ఒకదినమున వారివలలో నొక పెద్దచేఁప పడెను. ఈజాలరు లా చేఁపనుజూచి మిగుల

నాశ్చర్యమొంది దానిని భేదించిరి. గర్భమున దివ్యమంగళమూర్తులగు నిద్దఱు బిడ్డలుండిరి. వారిలో నొకబిడ్డ మగబిడ్డ, ఒకబిడ్డ యాఁడుబిడ్డ. "మత్స్యగర్భములో నేమి? మనుజశిశువులుండుట యేమి?" అనివారు మిక్కిలి వెఱఁగొంది యాపిల్లలనుదమపల్లె కధికారియగు దాశరాజున కర్పించిరి. కుమారుఁ డస్త్రాది విద్యలు నేర్చి పెద్దవాఁడై బలపౌరుషములు గలవాఁడై మత్స్య దేశమున కధికారి యయ్యెను.

కొమరిత పేరు సత్యవతి. ఈమెయొడలు చేఁపవాసన గొట్టుచే నీమెకు మత్స్యగంధి యనికూడఁ బేరు. తండ్రిపంపున నీమె యమునానదిమీఁదఁబడవనడపుచుండెను. ఇట్లుండఁగా నొకదినమున మహాతపశ్శాలియుఁ బరమశాంతుఁడునగు పరాశరమహామునీంద్రుఁడు తీర్థాటనము సేయుచు యమునానదిని దాఁటవచ్చెను. పడవనడుపు పడుచుఁబై దలిఁగాంచి, పరాశరుఁడు జ్ఞానవంతుఁ డయ్యును, దృఢమనస్కుఁడయ్యును, బూర్ణయౌవనయుక్తుఁ డగుటచేత నామె కధీనుఁ డయ్యెను. ఒడలికిఁ జేఁపకంపు పోయి సువాసన గలుగునట్లాతఁ డామెకు వరమిచ్చెను. అందుచే నామెకుఁ దరువాత యోజనగంధి యను పేరువచ్చెను. యోజనగంధియనఁగా యోజనము వఱకుఁ బరిమళించు శరీరముగలది. ఆ మహామునీంద్రుని యనుగ్రహమున నామె కొక్క కుమారుఁడుపుట్టెను. అతఁడే వేదవ్యాసుఁడు, పుట్టిన వెంటనె యాతడు తల్లిదండ్రులకు నమస్కరించి "తలఁచినపుడు నేను వచ్చెద!"నని తల్లికిఁ జెప్పి యామె సెలవుతీసికొని తపోవనమునకుఁ బోయెను.

తరువాత సత్యవతి కురురాజ్యమునకుఁ బ్రభుఁడగు శంతనుని పెండ్లాడెను. అమెకువానివలన చిత్రాంగదుఁడు విచిత్రవీర్యుఁడు

అనునిద్దఱుకొడుకులుపుట్టిరి. చిత్రాంగదుఁడుపడుచోఁదనముననే మరణించుటచేత విచిత్రవీర్యుఁడు రాజయ్యెను. ఈతనికి అంబిక యని అంబాలికయని యిద్దఱు భార్యలుండిరి. విశేషవిషయలంపట్టుఁడై అపుత్త్రకుఁడై యితఁడుకూడ మరణించెను. అంతసత్యవతి రాజవంశము సంతానశూన్యమగుటకు మిగుల దుఃఖించి తనకుమారుఁడగు వ్యాసమహర్షిని దలచుకొనెను. ఆతఁడు తల్లి కొసఁగినవరము ననుసరించి యామెకుఁ బ్రత్యక్ష మయ్యెను. తల్లిచేఁ బ్రేరితుఁడై తనతపోమాహాత్మ్యమున నంబికాంబాలికలయందు భారతవంశమును నిలువఁబెట్టెను. అంబికకుఁబుట్టినవాఁడు ధృతరాష్ట్రుఁడు. ఈతఁడు జాత్యంధుఁడు. అంబాలికకుఁ బుట్టినవాఁడు పాండురాజే. వెల్లఁబాఱి యుండుటచే నీతని కీపేరువచ్చెను. వ్యాసుఁడే కురుపాండవవీరుల కాదిపురుషుఁడని చెప్పవచ్చును. కౌరవయుద్ధగాథగల భారతమును రచించిన మహానుభావుఁడు వ్యాసుఁడే. ఇతఁడు వేదవిహితములగు నన్నిధర్మములను సులభరీతిని జనులకు బోధపడునట్లు భారతమం దిమిడ్చి రచియించెను. అందుచే భారతమునకుఁ బంచమవేద మని పేరువచ్చెను. అదికాక వ్యాసమహర్షి పదునెన్మిది పురాణములు వ్రాసె నని చెప్పుదురు. వేదములను విభాగించిన వాఁడును బ్రహ్మసూత్రములను వ్రాసినవాఁడును వేదవ్యాసుఁడే. ఆయన రచియించిన గ్రంథము లిన్నియన్ని కావు. ఏజాతిలోను ఏదేశములోను ఏకాలములోను ఏమహానుభావుఁడును, వ్యాసుఁడు వ్రాసినన్ని గ్రంథములు వ్రాసియుండ లేదు. ఆయన భగవదవతార మనికూడఁ జెప్పుదురు.

---



## 18. ఉప్పువర్తకుడు, అతనిగాడిద.

ఉప్పు వ్యాపారము చేసికొని జీవించునొకఁడు ఉప్పుకొనుటకై తనగాడిదను సముద్రతీరమునకుఁ దోలుకొనిపోయి కావలసిన సరకుఁ గొని సంచులలోఁ బోసి దానిపై వేసి కట్టెను. ఇంటికిఁ బోవు దారిలో అడ్డుగానొక కాలువ యుండెను. కాలువలో దిగి పోవుచుండఁగా కాలు జాఱుటవలన గాడిద నీళ్లలోఁ బడెను. పడి మఱల లేచునప్పటికి నీటిలో ఉప్పు కరఁగిపోవుటవలన, వీఁపుమీఁది బరువెంతో తగ్గిపోయెను.

అది గాంచి వర్తకుఁడు విక్రయ స్థానమునకుఁ దిరుగఁబోయి మునుపటికంటె నెక్కుడు సరకుఁ గొని గాడిదమీఁద వైచికొని

వచ్చుచుండెను. సుఖముమరగిన సుకుమారగార్దభము పూర్వ మువలెఁ బ్రమాదముచేఁ గాక యిప్పుడు బుద్ధిపూర్వకముగా నీళ్లలో మునిఁగి యుప్పంతయుఁ బోయినతరువాతఁ దేలికగా లేచి కృతకృత్యతామహానందముతో గట్టిగా నోండ్రించెను.

ఇదంతయుఁ దెలిసికొని వర్తకుఁడు గాడిదపొగరుడఁచుటకై దానిని దిరుగ సముద్రతీరమునకుఁ గొనిపోయి యీమారు లవణమునకు మారుగ లఘువుగానుండు 'స్పంజి' సరకును గొని పైనివేసి కట్టెను. గాడిద సంతోషముతోఁ దిరిగి కాలువలోనికి వచ్చి యెప్పటియట్లు దానిలో మునిఁగి తేలికగా లేవవలెనని లేచెను.

కాని పాపము! నీళ్లుపీల్చుకొనియుబుకుట 'స్పంజి'ధర్మము గనుక, సరకంతయు నీటితో మిక్కిలి బరువెక్కుటచే గాడిద నడుము విఱుగు నవస్థకు వచ్చెను.

ప్రపంచములోఁ దఱచుగా నెవరిమోసము వారినే చెఱుచును.

## 19. విషూచి.

మనము తినుఆహారమును, త్రాగునీరును, పీల్చుగాలియును అపరిశుద్ధములై యున్నయెడల ఆరోగ్యము చెడునని మీరిది వఱకేచదివియున్నారు. ఇంతేకాక, అజీర్ణము, జ్వరము, గ్రహణి అతిసారము, విషూచి మొదలగు వ్యాధులకు మూలములగు జంతువృక్ష సంబంధమైన పదార్థములు మలినజలమందుండి వచ్చుననియును అట్టినీటిని శుద్ధిపఱుపక త్రాగఁగూడదనియును కూడఁ జదివియున్నారు. అపరిశుద్ధజలము త్రాగుటవలన

గలిగెడు వ్యాధులలో మిక్కిలి భయంకరమైనదియు, ఏఁటేఁటను అనేకులఁ జంపి తీసికొని పోవునదియును అగు విషూచిని గుఱించి మీరిప్పుడు నేర్చుకొనఁబోవుచున్నారు. దీనికే కలరా యనియును, మరిడి జాడ్యమనియు పేళ్లు గలవు.

ఈవ్యాధియొక్క ఆరంభదశయందే కొందఱకు దీనియుగ్ర లక్షణములు గనఁబడును. కొందఱ కట్లుగాక యొకటి రెండు రోజులవఱకు, నీరసత, తలతిరుగుట, కడుపునొప్పి, సామాన్యా జీర్ణ విరేచనములు మొదలగు అనారోగ్య లక్షణములతో మెల్లఁగా పొడచూపును.

రెండవ దశయందు భయంకరమగు విరేచనములు పుట్టును. రంగుమాఱి విరేచనములు పలుచగా గంజినీళ్లవలె నుండును. చిమ్మన గొట్టముతో చిమ్మినట్లగును. గుబ్బుగుబ్బుమనియు గుడ గుడమనియు ప్రేగులార్చును. కడుపు బిగియఁ బట్టుటగాని, తెరలు తెరలుగా వచ్చు నులినొప్పిగాని సామాన్యముగా నుండదు. విరేచనములు ప్రారంభించినతోడనే కాళ్లు చేతులు చేలువలు గ్రమ్మును. ఉమ్మి చిక్కఁబడును. కాళ్లు పీఁకుకొని పోవును. విదాహము పుట్టును. విరేచనము లారంభించిన యొకటి రెండు గంటలకు వమనములు ప్రారంభించును. వాని రంగుగూడ విరేచనముల రంగే. మొదట జీర్ణముగాని పదార్థములు వమనమై పోవును. క్రమముగా శరీరము నందలిధాతు రసములు వాంతి విరేచనములద్వారమున బయటికిఁ బోవును. కనుకనే రోగిక్రమముగా నీరసించును, తరుముకొని వచ్చినట్లు వాంతులు తెఱపి లేకుండనగును. వమనములకుముందు కడుపు త్రిప్పుండదు. వమనము లగునప్పుడంత యాయాసమునుండదు.

క్రమముగా రోగికి బలము తగ్గును. నీరసత హెచ్చును. చివరకు అలసటఁ జెంది రోగి స్మృతితప్పి పడిపోవును. మొగము ముడుతలు పడును. కన్నులు గుంటలుపడును. శరీరము కాంతి విహీనమగును, గొంతుక బొంగుపోయి క్రమముగా హీనస్వరములోనికి దిగును. మూత్రము హరించును. నాడి సన్నగిల్లును. శరీరమందలి యుష్ణముతగ్గును. మందులు పనిచేయక పోయినచో చివరకు రోగి మృతినొందును.

అట్లుగాక యవి పని చేసినయెడల వాంతులును విరేచనములును తగ్గి, శరీరమందు మఱల నుష్ణముపుట్టును. నాడితిరుగ స్ఫుటముగా ఆడును. క్రమముగా మూత్రమగును. కొన్నాళ్లకు రోగి తిరుగ ఆరోగ్యవంతుఁడగును.

విషూచి యింటురోగము గాన, అది యెట్లు వ్యాప్తమగుచున్నదో తెలిసికొనిన పక్షమున దానికి ప్రతిక్రియలు చేసికొనవచ్చును. విషూచివ్యాధిని గలిగించునది యొక విధమైన సూక్ష్మజీవి. ఇది అంగుళము పొడుగును, అందులో ఆఱవ వంతులావును గలిగి కామా (') వలెనుండును. ఇంత చిన్నది. గనుకనే యిది కంటికగడదు కాని దీనిని సూక్ష్మదర్శినితో జూడఁగలము. దీనిని పరిశుద్ధమగు నీటిలో నుంచినయెడల ఆహార మందులో దొరకనందున ఇదిచచ్చును. అపరిశుద్ధజలమందుంచినయెడల కావలసినంత తిండి దీని కానీటిలో దొరకును; కాన, ఒకటిరెండై, రెండునాలుగై, నాలు గెనిమిదై, యిట్లు కొలఁదికాలములో లక్షోపలక్షలుగా ఇది పెరిఁగి నీటియందంతటను వ్యాపించును. ఇట్లిరువదినాలుగుగంటలలో ఒక్కవిషూచిజీవినుండి యొకకోటి యఱువదిలక్షల పురుగులు పుట్టునఁట.

ఇట్టి జీవులలో కొన్ని మనుష్యుని శరీరమందు ప్రవేశించిన వనుకొనుము. అప్పుడు వ్యాధి యంకురించిన రెండుమూఁడు రోజులలో ఎన్ని సూక్ష్మజీవు లుద్భవించునో యోజించినపక్షమున కొలఁదికాలములోనే రోగియేలమృతినొందుచున్నాఁడో తెలిసికొనఁగలవు. లోనఁప్రవేశించి విరేచనములను వమనములను గలిగించునవి సూక్ష్మజీవులే కనుక, అట్టిజీవులు శరీరమందుఁ బ్రవేశింప వీలులేకుండఁ జేయవలెను. ఒకవేళఁ బ్రవేశించిన పక్షమున ప్రాణమునకు హాని కలుగఁజేయకుండ వానినినశింపఁజేయు మార్గములు వెదకవలసి యున్నది.

విషూచి సాధారణముగా క్రొత్తనీటి రోజులలో వ్యాపించును. ఈరోజులలో బురదనీటియందు జంతువృక్షసంబంధమైన దుష్టపదార్థములు కొట్టుకొనిపోవును గాన, అనీటిలో విషూచీజీవి సంతానాభివృద్ధి నొందున ట్లితరకాలములందలి నిర్మలోదకములందు వృద్ధినొందఁ జాలదు. నీటిలో విషూచీజీవులనుంచి యానీటిని మఱిఁగించినచో అపురుగు లాఁవేడికిఁ జచ్చును. కనుక మనము త్రాగునీటిని ఇందుగువిఱిచి, వడఁబోసి మఱిఁగించి, చల్లార్చి యుపయోగించినచో బాధయేమియు నుండదు.

మఱుగుడు కాలువలనీటియందును, మఱుగుడుగుంటలనీటియందును విషూచిజీవు లెన్నో పెరుఁగుచుండును. ఈఁగలును దోమలును ఆనీటిమీఁద వ్రాలి తమ శరీరముల కాపురుగుల నంటించుకొని, యిండ్లలోనిభోజనపదార్థముల మీఁదను అంగళ్లలోని మిఠాయి మొదలగు వస్తువులమీఁదను వ్రాలివిషూచిని వ్యాపింపఁజేయును. చెమ్మకాలములోనే యీఁగల యుత్పత్తి

విశేషము. కనుక విషూచి గ్రామమందు వ్యాపించియున్నప్పు డట్టిపదార్థములను అంగడినుండి కొనఁగూడదు. చల్లారినభోజన పదార్థములను దినుట మానవలెను. పాలు పెరుఁగు మజ్జిగలు అతిజాగ్రత్తతోఁ గాపాడవలెను.

ఆరోగ్యవంతునిశరీరమున విషూచీ జీవులు ప్రవేశించినను వాని నేమియుఁ జేయలేవు. మనజఠరమునందు స్రవించు జఠర రసమునకు ఈసూక్ష్మజీవులఁ జంపెడుసామర్థ్యము గలదు. ఆరోగ్యవంతునకు జఠరాగ్ని మెండు. కనుక మనశరీరమును ఆరో గ్యముగా నుంచుకొనవలెను. బీదలు, పాపము! మంచియా హారమును సంపాదించుకొనలేక యనారోగ్యకర మగు పదార్థ ములను తిందురు. అందువలననే మాలపల్లెలందును, ఈంద్ర గూడెము లందును, సాలెపేఁటలందును విషూచి త్వరగా వ్యాపించును. భయము, అకాలభోజనము, అమితాశనము, నిద్రలేమియు అనారోగ్యమును గలిగించును. నిద్రలేమివలనఁ గలిగినయజీర్ణము విషూచికి పుట్టినిల్లు. కనుక, ఊరిలో విషూచి రోగ మున్నకాలములో రాత్రులందు నాటకములఁ జూడఁబో రాదు. ఉత్సవాదు లీరోజులలో కట్టిపెట్టవలెను.

ఎప్పుడును మంచిగాలి వీల్చుచుండవలెను. ఇండ్లలో గంధ కము పొగవేయించిన యెడల గాలిలోని పురుగులు చచ్చును.

ఇట్లు జాగ్రత్తపడినచో విషూచివ్యాపింపక బయలువెడలిన కొలఁదికాలములోనే యడుగంటును. విషూచి వచ్చినప్పుడు రోగము దాఁచిపెట్టక వెంటనే వైద్యునితోఁ జెప్పవలెను. అతఁడు మంచి మందు లిచ్చి రోగము నివారింపఁ జేయును, ఆరోగిని ఇంటిలో నుంపక వైద్యశాలకుఁ గొనిపోవలెను. అతని

కుపచారము చేయువారు తప్ప, ఇతరు లాతనిని దాఁకరాదు. అతని సంరక్షణముకొఱకు కొకరి నిద్దఱను నియమింపవలెను. రోగిగది ప్రత్యేకముగా నుండవలెను. ఆరోగినందఱును జూచు చుఁ బోవుచునుండరాదు. వాని విరేచనములును వాంతులును చుట్టుపట్లనుండు నూతులలోఁగాని చెఱువులలోఁగాని కలియ కుండ గోతులలోఁ బోసి అంపపుపొట్టుతో అంటింపవలెను. రోగము పోయినవెంటనే మందునీళ్లతో రోగిని కడుగవలెను. రోగివిడిచినగది కూడ మందునీళ్లతో కడుగవలెను. అతఁడు భుజింపఁగా మిగిలిన యాహారపదార్థము లితరులు భుజింపరాదు. ఒకవేళ రోగిమరణించినయెడల మందునీటఁదడిపినదుప్పటికప్పి సాధ్యమైనంత త్వరగా శవమును దహనము చేయింపవలెను.

---

## 20. సుందరి.

### ప్రథమాంకము

ప్రవేశము-సోమశర్మ-సుందరి.

సుందరి.— నాథా! మీరట్లు విచారగ్రస్తులైన ట్లుంటిరేల? ఇప్పుడు వచ్చిన టెలిగ్రాములో మఱేమియు తొందర వార్తలేవియు లేవు గద?

సోమ.—సుందరీ! నాయన్నగారు రవసానదశలో నున్నట్లు తంతివార్త వచ్చినది.

సుందరి.—అయ్యయ్యో! పాపము! ఎట్లుండునో! జబ్బుగా నున్నట్లయినను వినియుండలేదే. ఇప్పుడు టెలిగ్రాములో జబ్బేమని వ్రాసినారు?

సోమ.—జెబ్బుసంగతియే లేదు. ఇదిగో టెలిగ్రాము నీవు కూడఁ జూడుము.

సుందరి.—"Your brother dangerously ill, start immediately" (మీయన్నకుఁ బ్రాణముమీఁదికి వచ్చినది. వెంటనే బయలుదేఱుము.) అని యున్నది. నాథా! క్రింద చేవ్రా లెవరిది ?

సోమ.—అది యతనిభార్య సోదరునిదిలే. కాని, సుందరీ! నే నిప్పుడే పోవలయును. మెయిలు 6 గంటలకు వచ్చును. ఇప్పుడు 5—50 అయినది. భోజనమున కవకాశము లేదు. చేతిసంచి తీసికొని పోయెదను.

సుందరి.—మీరు మీగ్రామము చేరినవెంటనే క్షేమవార్త టెలిగ్రా మిచ్చెదరుకాదా ?

సోమ.—ఆయన కొంచెము స్తిమితముగా నున్న యెడల నేను రేపుసాయంకాలమే తిరుగ బయలుదేఱి వచ్చెదను. లేదేని, టెలిగ్రా మిచ్చెదను.

సుందరి.—ఈరోజున బుధవారము కాదా?

సోమ.—అవును. ఈరాత్రికే యక్కడకుఁ జేరుదును. రేపు సాయంకాలమందుఁ దిరుగ బయలుదేఱి రేపు రాత్రికే యిక్కడకు రావలెను.

సుందరి.—అటులైన నాలస్యమేల ? లెండు.

సోమ.—నీవొక్కతెవు నింటిలో నుండఁగలవా? మీ పిన తల్లిగారి యింటిలోఁ బండుకొందువా?

సుందరి.—ఈ రాత్రి వారియింటికిఁ బోనేల? నవుకరు వాఁడు సహాయుఁడుగా నుండును గదా! భయమేమి? అయిన నెట్లు వీలుగా నుండిన నట్లే చేయుదును.

సోమ.—సరే నేను బోవుదును.

సుందరి.—భోజనము లేకుండ వెళ్లుచున్నారు కదా!

సోమ.—దారిలో నేమైన భక్షించెదను. భద్రముగా నుండుము పోవుచున్నాను.

[ఇద్దరు నిష్క్రమింతురు.]

---

ద్వితీయాంకము.

దొంగలెలి గ్రామము.

ప్రవేశము-దుర్గాప్రసాదశాస్త్రి-ప్రదేశము-అరణ్యము.

దుర్గా.—బాలాత్రిపురసుందరీ! ఎవరువారు!

(సోమశర్మ ప్రవేశించును.)

సోమ.—అయ్యా! నేనొకబాటసారిని.

దుర్గా.—ఈయరణ్యమున కేల వచ్చితివి?

సోమ.—రైలుదారిలో ధూమశకటము పట్టాలనుండి జాఱి పోయినది. ఆబండిలో నేనుంటిని. మాయూరు తిరుగఁ బోవుచుంటిని. అనేకజనులు మరణించిరి. దైవేచ్ఛచే నేను బ్రతికితిని. అక్కడి ఘోరస్థితి చూడలేక యేమియుఁ దోఁచక యిటునడచివచ్చితిని. నేనుబయలుదేఱి దాదాపుగనొక జామయినది. ఇక్కడ దీప మగపడినది, శంకరభగవానులవలె మీరగపడినారు. నాపాపములు నాచింతలు నశించినవి.

దుర్గా.—కాని; యిప్పుడు మావలన నేమి కావలయును?

సోమ.— ఏమియు నక్కఱలేదు. ఈరాత్రి కీయింటిలోఁ బండు కొందును. తమ యనుజ్ఞ కావలయును. రైలు నడచు తోడనే పోవుదును.

దుర్గా.—మాతపస్సునకు విఘ్నముగ నుండునుగదా!

సోమ.—నేనట్లు ప్రవర్తింతునా? ఈ వసారలోఁ బండు కొందును.

దుర్గా.—సరే—నేను బోయెదను. నీవచ్చటఁ బండుకొనుము.

సోమ.—[పండుకొనుచు] ఆహా! ఈతఁ డెవ్వఁడో మహాను భావునివలె నున్నాఁడు.—పురవాసమును వదలి శాంతి కొఱకు వనవాసము చేయుచున్నాఁడు. మహాతపశ్శాలి. కనుబొమ్మల నడిమి కుంకమ రేఖనుబట్టి శక్తిపూజాతత్ప రుఁడనుకొందును. ప్రపంచమున నెందెందఱు మహాను భావులున్నారో! ఆహా! భగవానుఁడా! నీసృష్టి యనం తము కదా! నీయాజ్ఞ నిరంకుశముకదా! [ఆవులించు చున్నాఁడు] పరాత్పరా! రక్షింపుము. ఏదియో యలికిడి యగుచున్నది. ఎవరువారు?

(కనకమ్మ ప్రవేశించును.)

కన.—నిమ్మళముగ మాటలాడుము.

సోమ.—నీవెవతెవు? నీపేరేమి?

కన.—నిమ్మళముగ మాటలాడుము. నా పేరు కనకమ్మ నేనొక బ్రాహ్మణిని. నన్నితఁడు—ఈచండాలుఁడు-ఈదొంగలగురువు, ఈమిథ్యావేదాంతి, కొంతకాలముక్రిందట నిటకుఁ దెచ్చి నాఁడు. నన్ను సర్వవిధముల హింసించుచున్నాఁడు.

సోమ.—అయ్యయ్యో! అతఁ డట్టివాఁడా! నన్ను నీకేమిచేయు మనెదవు ?

కన.—నీవు నాకేమియుఁ జేయనక్కఱలేదు. నిన్నరాత్రి యీతఁ డెక్కడనుండియో దొంగలచే నొకయప్సరసవంటి కన్నెను హరింపఁజేసి యామె నీసాయంకాలమున కిక్కడకుఁ దెప్పించి యీ యింటిలో దాఁచినాఁడు. ఆమెను రేపు శుక్రవార ముదయమునఁ జెఱువుగట్టున నున్న దుర్గాదేవికి బలియిచ్చునఁట. ఆమెను నీవు రక్షింపవలయును.

సోమ.—అయ్యయ్యో! ఎంతప్రమాదము సంభవించినది! కాని, నీవిక్కడకు వచ్చినట్లే యామె నిక్కడకుఁ దీసికొనిరాలేవా ?

కన.—ఆమెను గదిలోఁ బెట్టి తాళమువేసి తాళముచెవి తన మొలలోఁ గట్టుకొనినాఁడు.

సోమ.—పోనీ! ఆతఁడెక్కడ నున్నాఁడు? అతనితో మఱెవ్వరైన నున్నారా ?

కన.—ఆతఁ డామె కెదురుగదిలోఁ గూర్చుండియున్నాఁడు. ఈ రాత్రి నిద్రపోఁడు. ఆతని గుమ్మము నొద్ద నిద్దఱు కాపుగా నున్నారు.

సోమ.—వారిద్దఱునుకూడ దొంగలేనా ?

కన.—కారు, వారాతనిభటులు. ఆ కాంతను దెచ్చిన దొంగ లెవ్వరు నిచ్చటలేరు. నీ వాతని నెదుర్కొనలేవు. నీవంటి వారిని పదిమంది నాతఁ డెదుర్కొనఁగలఁడు.

సోమ.—ఏమిచేయవచ్చును? ఏమియుఁ బాలుపోకుండనున్నది. ఆకాంతవృత్తాంత మేమైన నీవు గనుఁగొంటివా?

కన.—నన్నామెతో మాటలాడనిచ్చెదరా! ఆమెనుమాత్రము చూచి యిట్టి రూపవతి యిట్టిమరణమునొందుట తగదని యెంచి—(కన్నీరు గ్రుక్కుకొనును) నీతో నొకసంగతిఁ జెప్ప మఱచితిని. తెల్లవాఱకుండ వెడలిపొమ్మని యాతఁడు నీతోఁ జెప్పమనినాఁడు. కాని యామెను రక్షింపఁగలవా?

సోమ.—వెఱ్ఱిదానా! రక్షించువాఁడు భగవంతుఁడు కాని మనమా?

కన.—ఈవేదాంతము వినుటకు రాలేదు. ఇంతేనా?

సోమ.—నాప్రాణము నిల్చిన నాకుఁ జాలును. నా కీగొడవ యేల?

కన.—ఛీ— [పోవును]

సోమ.—ఈరాత్రి నిద్రపట్టదు. దైవధ్యానము చేసికొనుచు మేలుకొని యుండెదను.

---

## తృతీయాంకము.

### ప్రదేశము - దుర్గాలయము.

[దుర్గావిగ్రహము వెనుక సోమశర్మ దాఁగియుండును.]

దుర్గాప్రసాదశాస్త్రియుఁ గనకమ్మయు వేఁపాకుతోఁ బసుపుతో నలంకరింపఁబడిన సుందరియుఁ బ్రవేశింతురు.

దుర్గా.—ఓకాంతా! చక్కనికాంత నెవతెనైనఁ దనకు బలి యిచ్చినయెడలనాకు గొప్పనిక్షేపము గనఁబఱతు నని దుర్గ నాకు స్వప్నమునఁ జెప్పెను. అందుచే నిన్ను దుర్గాదేవికి బలియీయ నిటకుఁ దెప్పించితిని. కావున సిద్ధముగా

నుండుము. దురే! లీలాలోలితభర్గే—మాం పాహి! మాం పాహి !

(అంతట దుర్గచాటుననున్న సోమశర్మ తుపాకి పేల్చెను. ఢామ్మని పెద్దధ్వనియైనది. దుర్గాప్రసాదశాస్త్రి నేలఁబడియెను, కాంత లిద్దఱును నిశ్చేష్టలైరి.)

సోమ.—(దుర్గచాటునుండి యీవలికి దుమికివచ్చి) కనకమ్మా! నీకాంత దైవకటాక్షమున బ్రదికినది.

సుందరి.—నానాథుఁడే! నానాథుఁడే!

సోమ.—(వేఁపాకులన్నియుఁ దీసివైచి) సుందరీ! సుందరీ! నీవే! నీవే;

సుందరి.—నేనే ! మీయన్నగారు క్షేమముగ నున్నారు కాదా !

సోమ.—అది దొంగటెలిగ్రాము.

సుందరి.—ఆ సంగతి మొన్నరాత్రియే నాకుఁ దెలిసినది.

సోమ.—ఎట్లు ?

సుందరి.—మీరు వెడలినతరువాతఁ గొంతసేపటికి మాయూరిలోనున్న మాపినతల్లిగారి భటుఁడువచ్చి మీపిన్నమ్మగారు రమ్మనుచున్నారనెను. అంతటనేఁ బోవుచునుండఁగానిద్దఱు దొంగలు నన్నుఁ బట్టుకొని గుఱ్ఱపుబండిలో వైచి బండి తోలించుకొని పోయిరి.

సోమ.—మీ పిన్నమ్మగారి భటుఁడు దొంగలవలన సొమ్ముదీసికొని యిట్లు చేసినాఁడు కాఁబోలు.

సుందరి.—అట్లే కావచ్చును. తరువాత దొంగలు నన్నేమియు ననలేదు. దొంగటెలిగ్రాము మన బుఱ్ఱనిచే నిప్పించి

సోమన్నగారిని బాగుగా మోసపుచ్చితిమిరా! యని దొంగలు తమలోఁ దాముసుకొనిరి.

సోమ.—ఈదొంగలకొక సహకారి మాయన్నగారి యూర నున్నాఁడు కాఁబోలు.

కన.—రాక్షసవధ మైనదికదా! ఇఁక శీఘ్రముగ మీగ్రామమునకుఁ బోవు ప్రయత్నమును జేసికొనుఁడు.

సోమ.—తెల్లవాఱినది ఇఁక భయమేమి? మా ప్రాణములు రక్షించిననిన్ను మేము వదలిపోవుదుమా! నీవుకూడ రమ్ము.

కన.—అయ్యా! నిన్నడుగ మఱచితిని ఈవిధముగా నీమె ప్రాణముఁ గాపాడఁ దలచినాఁడవుకదా? నిన్నరాత్రి నాతో "నాప్రాణమున్నఁ జేలును. నాకీ గొడవయేల" అని యేల పలికితివి?

సోమ.—క్షమింపుము. నీయందుఁ బరిపూర్ణమగు నమ్మక మప్పుడు లేక యటులంటిని. పోవుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

---

## 21. కోడి రామమూర్తి నాయఁడుగారు.

ఇప్పటికాలపు బడిపిల్లవాండ్రలో పెక్కురు దుర్బలశరీరులై గుంటకన్నులతో చొప్పిదాడలతో, బయలు పడిన యెముకలతో, బలమన్నమాట లేక కాన్పించుచున్నారు గదా! శరీర దౌర్బల్యముచే ననేకరోగములును అకాలవార్ధకమును, చింతా వ్యాకులత్వమును మనోదౌర్బల్యమును, తుదకు కాలమరణము ప్రాప్తించుచున్నవి. శరీరకలంకము చిత్తకలంకమునకుఁగూడఁ



గారణము. మనసున కుల్లాసము లేని బ్రతుకు నరకప్రాయమని యే చెప్పవచ్చును. బాలురు వారివయస్సునకుచితములగు ఆట పాటలయందుఁ జేరకుండుట; పెద్దలధనతృష్ణచే వయసునకును బుద్ధికిని మీఱి రుచింపనివిద్య నభ్యసించుటలో వారు పడు అత్యంత మైన మనఃక్లేశము, బాల్యవివాహములును, కొని దురభ్యాసములును, ఇట్టి దుస్థితికి ముఖ్యకారణములు.

వీనినాఁపి శరీరవ్యాయామము బాలుర కలవడఁజేసినఁ గాని ముందుముందు మన హిందూదేశములో నేలమునఁగ చెట్టునకు నిచ్చెనలువేయు ఆజానుబాహులును పంచదశాబ్దములకే పంచత్వమున కెదురుచూచుచుండు చిరంజీవులును బయలు దేఱుదురు.

శరీరవ్యాయామమునందు మిక్కిలి కుశలుఁడై శరీరసౌఖ్యమును, దానితో మనస్సౌఖ్యమును నిత్య మనుభవించుచు, ఎంతో కీర్తి ధనముతోఁగూడ నార్జించి, ముందువచ్చువారికి మార్గదర్శకుఁడైన యొక యుదారపురుషునిచరిత్ర మిచ్చట సంగ్రహముగా వ్రాసెదము. ఆయన పేరు కోడి-రామమూర్తి నాయఁడుగారు. ఆయన మన యాంధ్రుఁడు. ఇప్పుడుసజీవుఁడై యున్నాఁడు. ఇట్లే చిర కాలముండునట్లు భగవంతుఁ డనుగ్రహించుఁ గాక !

రామమూర్తిగారు 1882-వ సంవత్సరములో విశాఖపట్టణపు జిల్లాలో, విజయనగరప్రాంతమం దున్న వీరఘట్టమను గ్రామములో జన్మించినారు. తలిదండ్రులు విశేష శరీరపుష్టి గలవారు గారు. కనుక జన్మముచేతనే యితఁడు దృఢగాత్రుఁడని చెప్పుటకువీలు లేదు. శైశవమునందు ఉబ్బసమువలనఁగూడ బాధపడినాఁ డఁట. అది దైవకృపచే తరువాత నిమ్మళించెను.

తండ్రి యితనిని యుక్తకాలములోనే బడిలోవేసెను గాని చేదువేమియు నంటలేదు. కాని, యితఁడు కసరతు, గరిడీ, సాము, దండెములు, పట్లు మున్నగు స్వదేశ వ్యాయామములందుఁ జిన్ననాఁటినుండియు మిక్కిలి సరదాగలవాఁడు. పరుగెత్తుటలోను, ఈఁదుటలోను బహుసమర్థుఁడు.

రమూరమిపదాఱేండ్ల వయస్సురాఁగానే చెన్నపట్టణమునకు దగ్గఱగానున్న సైదాపేట కాలేజీలో ఇంగ్లీషు కసరతునేర్చుకొనుటకై ప్రవేశించి చివరకుఁ దనతోఁ బరీక్షనిచ్చిన వారిలో మొదటివాఁడుగా గణనకువచ్చి గొప్పసన్మానము నొందెను.

కాని పాశ్చాత్త్యవ్యాయామపద్ధతి యతని మనస్సునకు సరిపడినది కాదు. దానికి మిక్కిలి విలువగలసాధనసంపత్తి కావలయును. అదియుఁగాక దానికై పడుశ్రమమునకుఁ దగినఫలము లేదు. పట్టి కండపుష్టి కలుగునేకాని దానికిఁదగిన శరీరబలము రాదు. ఈకారణములచే నతఁడు స్వదేశపద్ధతినే యవలంబించి చాలఁ గృషిచేసెను.

అద్భుతామానుషచర్యలు చేసిరని పురాణములలోఁజెప్పఁబడిన ఆంజనేయుఁడు భీముఁడు మున్నగు మహా బలశాలులు కల్పితపురుషులు గారనియు పాటుపడి పనిచేసినచో మనము వారంతవారము కాక పోయినను వారిబలములోఁ గొంతయైన సంపాదింపఁగల మనియు రామమూర్తిగారి నమ్మకము. అట్టిపనియేది యనఁగా—అందఱును చేయు కసరతునకుఁ దోడుగాఁ బ్రాణాయామ మభ్యసించుట, యేశరీరభాగమున కెక్కువబలము కావలయునో యాభాగముమీఁదను ఏకాగ్రచిత్తులమై లక్ష్యముంచుట, యని యాయన పెక్కుసారులు నొక్కిచెప్పినారు. మనోబలమే దేహబలమునకు ముఖ్యసాధనమని ఆయనసిద్ధాంతము.

1902-వ సంవత్సరములో రామమూర్తి తుని సర్కసులోఁ జేరి కొంతకాలము పనిచేసెనుగాని స్వల్పకాలములో ఆ సంఘము చెదరిపోయెను.

1905-వ సంవత్సరములో యూజీన్సేండో యను ప్రసిద్ధ పాశ్చాత్య మల్లుఁడు చెన్నపట్టణములో నుండఁగా బలాబలములు చూచుకొనుటకుఁ దనతో పట్టుపట్టుమని యాతని నడిగెను. కాని, హైందవుఁ డని రామమూర్తిని నిర్లక్ష్యభావముతోఁజూచి "సేండో" యందుల కొప్పుకొనలేదు. ఆ సంవత్సరపు క్రిస్మసుపండుగులలో చెన్నపట్టణపుగవర్నరుగారగు "ఏమ్ప్టిల్లు" గారి సమ్ముఖమున రామమూర్తి తనబలకౌశలములను ప్రదర్శించి మిక్కిలి మెప్పువడసెను.

1906-వ సంవత్సరము జానూర్యాలరినెలలో అప్పుడు మన దేశము చూచుటకువచ్చియున్న శ్రీజార్జిగారియెదుటను శ్రీమేరిగారి యెదుటను రామమూర్తి తనసామర్థ్యమును గనఁబఱచి వారివలన నొక బంగారుపతకమును బహుమతిగాఁ బడసెను. అంతటఁ బ్రత్యేకముగాఁ దానొక సర్కసుసంఘము నేర్పఱచుకొనెను. 1909-వ సంవత్సరములో నతనిశక్తిని జూచి యప్పటి రాజప్రతినిధిగారగు మింటోదొరగారు దొరసానిగారుఁగూడ నొకపతకము బహుమానము చేసిరి. ఇట్లే యనేకులైన రాజేలు మహారాజేలు, నవాబులు, గొప్పగొప్పయుద్యోగులును ఈయనకుఁ జేసిన సత్కారములకు మితిలేదు. ఎన్నిపతకము లాతని బొమ్మలో మెడచుట్టునున్నవో మీరు చూడవచ్చును. పతకములేకాక యితర బహుమానము లనేకములు పొందినాఁడు. కొందఱతని కమూల్యములైన జరీబట్టల నిచ్చిరి. కొందఱు రూపాయలసంచు లిచ్చిరి. ఒక మహారాజొక యేనుఁగును ప్రశస్తమైన వజ్రపుటుంగరమును బహుమతిచేసెను.

ఇట్లు మన దేశములో ముఖ్యమగు పట్టణములకును పరదేశములకును గూడ రామమూర్తి వెళ్ళి యమితమైన ధనమును సంపాదించెను. 1911-వ సంవత్సరములో ఇంగ్లండునకుఁగూడఁ జని యచటఁ దన మహిమమును వెల్లడిపఱిచెను. ఒక్కొక్క ప్రదర్శనమునకు వేయిరూపాయలు మొదలైదువేలవఱకును పారితోషిక ద్రవ్యము వచ్చెడిదఁట. ఇంతవచ్చినను నిలువచేసి కొనెడివాఁడుగాఁడు. మిక్కిలి వదాన్యుఁడు, బీదలకు, ఇతరసత్కార్యములకు. దేశాభివృద్ధికిని జాల గానిచ్చువాఁడు. మన దేశములో నుచితమైన స్థలమునఁ, దనకు గట్టివిశ్వాసమున్న ప్రాచీన పద్ధతుల ప్రకారము, దేహపరిశ్రమము నేర్పుట కనువగు నొక వ్యాయామకళాశాలస్థాపించుటకై యిప్పుడు తనయాదాయములో కొంతభాగము వెనుక వేయుచున్నాఁడఁట. భగవంతుఁ డీసదుద్యమమును శీఘ్రకాలములో కొనసాగించుఁగాక.

కట్టు బట్టలలోఁగాని, తిను నాహారములోఁగాని, యుండు నునికిలోఁగాని యతని కెంతమాత్రమును డాబు లేదు.

ప్రథమావస్థలో మాంసమునుదిను చుండినను, రామమూర్తి యిప్పుడు దానిని బూర్తిగా వర్జించినాఁడఁట. చేఁపలు, గ్రుడ్లను దినఁడఁట అన్నము, పప్పు, కూరలు——అన్నియు నొకటిగాఁ గలిపి బొద్దసన్యాసివలె భుజించునఁట. కాఫీ, తేయాకు, కోకో, యివియేమియుఁ ద్రాగఁడఁట. మద్యపానము చేయఁడని వేఱె చెప్ప నక్కఱలేదు. బాదముపప్పు, జీలకఱ్ఱ, మిరియములు, పంచదార, కలిపిన పానక మతనికిష్టమైన పానీయము. దాని వెనుక క్రొత్తవెన్న తినునఁట.

బ్రహ్మచర్యము శరీర బలారోగ్యములకు మిక్కిలి సహా

కారి యని రామమూర్తి యభిప్రాయము. ఆతఁ డిప్పటికిని అవి వాహితుఁడుగనే యున్నాఁడు. ఇట్టి సామాన్యమైన యాహార పదార్థములతో, ప్రాణాయామముతో, మనోనిగ్రహముతో, ఏకాగ్రచిత్తతతో; రామమూర్తి యనేకవిచిత్రములు చూపశక్తుఁడైనాఁడు.



బలిష్ఠమైన యినుపగొలుసును ద్రెంపుట, యెంతో బరువుగల రాతిబండను వీఁపుమీఁద మనుష్యులతో నెక్కించుకొనుట, దానిని పెద్దసమ్మెటలతో వీఁపుపై ముక్కలుముక్కలుగఁ గొట్టించుకొనుట, పండుకొనిబరువైనబండ్లను పైని,

బోనిచ్చుకొనుట, జంటమోటారుబండ్లను అవలీలగానాఁపుట, ఱొమ్ముమీఁదను పెద్దబల్లవేసికొని దానిపై నేనుఁగు నడచు చుండఁగా క్రిందఁ దా నుండుట, యిట్టి యద్భుతకృత్యములు రామమూర్తి చూపఁగలఁడు. పెద్దగజముపైని నడచుచుండఁ గా క్రింద రామమూర్తి యెట్లుండెనో యిందులో వేసిన బొమ్మఁ జూచి మీరు తెలిసికొనగలరు.

నేను యుద్ధమునకువచ్చి రాజభక్తిని దేశభక్తిని జూపించు కొనెద నని రామమూర్తిగారు రాజప్రతినిధిగారితో మనవి చేసికొనఁగా, వారు "అవసరము వచ్చినయెడల మీవాగ్దాన మును మఱవము" అని ప్రత్యుత్తర మిచ్చినారు.

రామమూర్తిగారివంటి బలశాలులును. వితరణశాలులును పరోపకారులు నే మన దేశమాతకు సత్పుత్రు లనఁదగినవారు.

---

## 22. భాగవతము.

ప్రథమస్కంధములోని పద్యములు.

(శ్రీకృష్ణ నిర్యాణవార్త.)

ద్వారకకు వెళ్లి యర్జునుఁ డెంతకు రాకుండుటచేతను, దుర్ని మిత్తములు గాన్పించుటచేతను, ధర్మరాజుచింతాక్రాంతుఁడై యుండఁగాఁ దమ్ముఁడువచ్చి యన్నకు నమస్కరించి కన్నులనీరు పెట్టుకొని నిలుచుండెను అప్పుడు ధర్మరా జిట్లర్జును నడిగెను.

శా. అన్నా ఫల్గున ! భక్తవత్సలుఁడు, బ్ర
  హ్మణ్యుండు, గోవిందుఁ డా
పన్నానీకశరణ్యుఁ, డీశుఁడు. జగ
  ద్భద్రానుసంధాయి, శ్రీ

మన్న వ్యాంబుజపత్త్ర నేత్రుఁడు, సుధ
ర్మామధ్యపీఠంబునం
దున్నాఁడా బలభద్రుఁగూడి సుఖియై
యుత్సాహియై ద్వారకన్ ?

శా. మున్ను గ్రాటవిలో వరాహమునకై
ముక్కంటితోఁ బోరుచో
సన్నాహంబునఁ గాలకేయుల ననిం
జెండాడుచో, బ్రాభవ
*స్కన్నుండై చెనుకౌరవేంద్రుపనికై
గంధర్వులం దోలుచోఁ
గన్నీ రెన్నఁడు దేవు తండ్రి ! చెపుమా
కల్యాణమే చక్రికిన్ ?

క. ఓడితివో శత్రువులకు ?
నాడితివో సాధుదూషణాలాపములం
గూడితివో పరసతులను ?
వీడితివో మానధనము వీరులనడుమన్ ?

క. అడిచితివో భూసురులను ?
గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా ?
విడిచితివో యాశ్రితులను ?
ముడిచితివో పరులవిత్తములు లోభమునన్ ?

(అనిపలికినం గన్నీరు కరతలంబునం దుడిచికొనుచు, గద్గద స్వరంబున మహానిధిం గోలుపోయిన పేదచేందంబున నిట్టూర్పులు నిగిడించుచు నర్జునుం డన్న కిట్లనియె.)

---

* పడినవాఁడు (=ప్రాభవము పోయినవాఁడు.)

క. మనసారథి మనసచివుఁడు
మనవియ్యము మనసఖుండు మనబాంధవుఁడున్
మనవిభుఁడు గురుఁడు దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా !

క. కంటకులు నృపులు సూడఁగ
మింటం గంపించుయంత్రమీనముఁ గోలన్
గెంటించి మనము వాలుం
గంటిం జేకొంటి మతనికరుణను కాదె !

క. దండి ననేకులతో నా
ఖండలుఁ డెదురైన గెలిచి ఖాండవవనముం
జండార్చికి నర్పించిన
గాండీవము దొరకెఁ జక్రికలుగుట నధిపా !

క. దిక్కుల రాజుల నెల్లను
* ప్రక్కించి ధనంబు గొనుట మయకృతసభ ము
న్నెక్కుట జేన్నము సేయుట
నిక్కము! హరి మనకు దండ నిలుచుటఁ గలిగెన్.

శా. వైరుల్ కట్టినపుట్టముల్ తివియఁగా వారింప నావల్లభుల్
రా రీవేళ నుపేక్ష సేయఁదగవే? రావే! నివారింపవే!
లే రే ప్రాతలు కృష్ణ! యంచుసభలోఁ బ్రాలీనాంగి యైకుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితం గాఁ జేయఁడే ద్రౌపదిన్?

సీ. దుర్వాసుఁ డొకనాఁడు దుర్యోధనుఁడు పంపఁ
బదివేల శిష్యులు భక్తిఁ గొలువఁ

---

* చంపి—ఓడించి.

జేను దెంచి మనముఁ బాంచాలియుఁ గుడిచిన
వెనుక నాహారంబు వేఁడికొనినఁ
బెట్టెద ననవుడుఁ బెట్టకున్న శపింతు
ననుచుఁ దోయావగాహమున కేగఁ
గడవల నున్న శాకములు దీఱుటఁ జూచి
పాంచాలపుత్రిక పర్ణశాల

తే. లోనఁ దలచిన విచ్చేసి లోవిలోని
శిష్టశాకాన్నలవముఁ బ్రాశించి తపసి
కోప ముడిగించి పరిపూర్ణ కుక్షిఁ జేసె!
నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁ గలఁడు?

సీ. చెలికాఁడ! రమ్మని చీరు నన్నొకవేళ
మన్నించు నొకవేళ మఱఁది యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ
దాతయై యొకవేళ ధనము లిచ్చు
మంత్రియై యొక వేళ మంత్ర మాదేశించు
బోధియై యొకవేళ బుద్ధి సెప్పు
సారథ్య మొనరించుఁ జేనవిచ్చి యొకవేళఁ
గ్రీడించు నొకవేళ గేలిసేయు

తే. నొక్కశయ్యాసనంబున నుండుఁ, గన్న
తండ్రికైవడిఁ జేసిన తప్పుఁ గాచు
హస్తములు వట్టి పొత్తున నారగించు
మనుజవల్లభ! మాధవు మఱపు రాదు.





ఆకుఁ జిలుక.

## 23. ఆకుఁజిలుక.

జీవకోటిలో మృగములు, పక్షులు, కీటకములు మొదలగు ననేకజాతు లున్నవి గదా ! మృగములను గూర్చియుఁ బక్షులనుగూర్చియు మీ రిదివఱకుఁ గొంచెము చదివియున్నారు. కీటకము లని వేనిని బిలుచుచున్నామో వానిని గుఱించి యిప్పుడు కొంచెము నేర్చుకొనుట మంచిది.

ఇండ్లలోఁ బగలెల్లను మనము చూచు ఈఁగలును వంటయిండ్లలోనుండు బొద్దిఁకలును, మనకుఁ దేనెను గూడఁబెట్టు తేనెయీఁగలును, మిడుతలు, చిమ్మటలు, ఇలకోడులు కుమ్మరపురుగులు, తుమ్మెదలు, అకుఁజిలుకలు, కందురీఁగలు గొల్లభామలని చెప్పుకొను పురుగులు, దోమలు. చీమలు, చెదపురుగులు, ఇంకను ఎన్నోజీవు లొకజాతికీటకములు. పెక్కువిధములైన కీటకము లితరములు కలవుగానిఁ యీజాతి కీటకములగూర్చియే యిచ్చటఁ జెప్పెదము.

ఇట్టి పురుగులన్నిటికిని శరీరము మూఁడుభాగములుగా విభజింపఁబడియుండును. అవి తల, ఱొమ్ము, పొట్ట. తలకును ఱొమ్మునకును నడుమ ఖండించినట్లుండును. ఱొమ్మునకునుపొట్టకును నడుమఁగూడ ఖండించినట్లె యుండును. ఱొమ్మును పొట్టయుఁ జిన్నగట్టికొమ్ముటుంగరములతోఁ జేయఁబడినట్లుండును. అట్టియుంగరములు సాధారణముగా ఱొమ్మునమూఁడును పొట్టను పదియు నుండును.

మనకువలెఁ గాక,తలకు ప్రక్కలను రెండు కన్నులుండును; అందువలన ఈజాతువులు చుట్టుప్రక్కల నులువుగాఁ బరికించి శత్రువులనుండి పాఱిపోవుటకు మిక్కిలి వీలుగా నుండును.

వీని దౌడలు పైకిని క్రిందికిని ఆడుటకు బదులుగా ప్రక్కలకుఁ గదలును. వీనిలోఁ గొన్నిటికి నాలుగు దౌడలుండును. రెండాహారమును బట్టుకొనుటకును, మిగిలిన రెండును నమలి మ్రింగుటకును ఉపయోగపడును. మధుమక్షికవంటిపురుగులకు నమలుదౌడలకుమాఱు, తేనెవంటిపానీయములు త్రాగుట కనువగు గొట్టము లుండును.

మధ్యఖండమునకు, ముందు రెండుకాళ్లును వెనుక నాలుగు కాళ్లును, మొత్తముమీఁద ఆఱుకాళ్లుండును. అందువలననే తుమ్మెదల షట్పదము లందురు. మిడుతలకును గొల్లభామలకును దుముకుట కనుకూలములగు పొడుగైనకాళ్లును, బలములైన తొడలును ఉండును.

ఈ జాతికీటకములకుఁ గొన్నిటికి రెండుఱెక్కలును, గొన్నిటికి నాలుగు ఱెక్కలును ఉండును.కొన్నిటి కుండనె యుండవు.

ఆకుఁజిలుకను గూర్చి కొన్ని విశేషములు చెప్పెదము. తన గ్రుడ్లు పిల్లలైనతరువాత వానికిఁ దగినంత యాహారముదొరకు అరఁటిచెట్టు ఆముదపుఁ జెట్టుఁ మునగచెట్టు మొదలగువాని మీఁద అకుఁజిలుక గ్రుడ్లుపెట్టును. ఈగ్రుడ్లనుండి క్రమముగా చిన్నచిన్న పురుగులు బయలుదేఱును. వీనినే మనము గొంగళి పురుగు లనుచున్నాము. ఈపురుగు లాయాకులందలిసారమును భుజించి కొలఁదికాలములో నేబలిసి యాహారవాంఛలేక నిద్రను గోరుచుండును. ఇట్టిస్థితిలో ఈపురుగు ఏగోడమూలకో యేచెట్టు మఱుఁగునకో ప్రాఁకి తన్నుండి వచ్చిన పదార్థములతోనె మెత్తని వెచ్చని యొక గూఁడల్లుకొని యందులోఁ గదలక మెదలక పడియుండును. కొంతకాలమున కీఁగూటిని విడఁగొట్టికి దానిలో

నుండి చిత్రవర్ణములు గల ఱెక్కలతోనొక చక్కని యాకుఁ జిలుక పైకివచ్చును ఇది తిరుగ గ్రుడ్లు పెట్టును. ఆగ్రుడ్లు గొంగళిపురువు లగును. వానినుండి తిరుగ ఆకుఁజిలుకలు పుట్టును.

చూడ నసహ్యమగు గొంగళిపురుగునుండి సొగసైన యాకుఁ జిలుక యెట్లువచ్చినదో యాభగవంతునకే యెఱుక.

---



## 24. హరిశ్చంద్రునికథ.

స్వర్గలోకమునందు సుధర్మాసనముపై గూర్చుండి "ఈ కాలమున దేవతలలోఁగాని మనుష్యులలోఁగాని ఆడితప్పనివా

యంతయొ త్తగు ధనరాశి కావలయు నని ముని చెప్పెను. బండారమునుండి తీసుకొనుఁడని రాజు చెప్పెను. "ఇప్పుడు నాకక్కఱ లేదు; కొలఁది దినములలో వచ్చి తీసికొనిపోవుదు" నని ముని చెప్పి పోయెను.

అంత విశ్వామిత్రుఁడు మాయామృగములు సృజించి రైతుల పొలములఁ బాడుచేయించెను; వానిని జంపుటకై హరిశ్చంద్రుఁడు భార్యాపుత్త్రప్రధానులతో వేఁటకుఁబోయెను. వేఁటలో వసిష్ఠుఁడగపడి వేఁట చక్రవర్తులకుఁ దగదనియు, విశ్వామిత్రుని యాశ్రమమునకుఁ బోకుండ శీఘ్ర మయోధ్యకుఁ బొమ్మనియు మందలించెను. అంత విశ్వామిత్రుఁడొక మాయలేడిని సృజించి హరిశ్చంద్రు నెదుట సంచరింపఁ జేసెను. దానిని దెమ్మని హరిశ్చంద్రపుత్త్రుఁ డగు లోహితాస్యుఁడు కోరఁగ దానివెంబడిని రాజు సభార్యాపుత్త్రుఁడై విశ్వామిత్రునాశ్రమమునకుఁబోవలసివచ్చెను. మాయాలేడి చిక్కకపోవుటచే రాజు దాని బాణముచేఁ గొట్టెను. అది యదృశ్యమయ్యెను. రాజు మిగులడస్సి భార్యతొడపై నించుక శయనించి యెవఁడో బ్రాహ్మణుఁడు తనకిరీటమును దన్నెనని కలఁగనెను. అంత లేచి భార్యతో దుస్స్వప్నమును జెప్పి విచారించుచుండఁగా విశ్వామిత్ర కల్పిత లగు నిద్దఱు మాతంగకన్యలు, రాజునొద్ద నిలువఁబడి గానముచే నాట్యముచే నాతని సంతోషపెట్టిరి. రాజు వారికిఁ గొన్ని రత్నాభరణము లిచ్చెను. "మాకాభరణములు వలదు; మమ్ము వివాహము చేసికొ"మ్మని యాకన్యలు రాజుమీఁదికి రాఁగ నతఁడు బెత్తముతో బెదరించెను. అది వంకగా నా చండాల బాలికలు హోరుహోరున నేడ్చుచు విశ్వామిత్రునితో మొఱ

డెవఁడైన నున్నాఁడా''? అని దేవేంద్రుఁడు మునులను బ్రశ్నిం చెను. మును లందఱొకరిమొగ మొకరు చూచుకొని కొంత సేపు మిన్నకుండిరి. అంత వసిష్ఠుఁడు "భూలోకముననిప్పుడు హరిశ్చంద్రుఁ డనుచక్రవర్తి పలికిబొంకనివాఁడున్నా"డని పలికెను. వసిష్ఠునిమాటలు విని యాతనిపైఁ జిరకాలకోపముగల విశ్వామిత్రుఁడతని మాట యెట్లైనఁ గాదనవలయుననుపట్టుదలతో నిట్లనియెను. "వసిష్ఠుఁడు హరిశ్చంద్రుని పురోహితుఁడగుటచేతనిట్లుపలికినాఁడు. హరిశ్చంద్రుని నే నెఱుఁగనివాఁడను గాను. అతఁడు సత్యవాది కాఁడు. అతనిచేత నే నసత్యమాడింపఁగలను'' అని ఖండితముగాఁ బలికెను. అంత వసిష్ఠుఁడు కోపోద్దీపితుఁడై "నీవాతని నసత్యమాడింతువేని నేను జేందెములు త్రెంపి పాఱవైచి జపతపములు చాలించి తలగొఱిగించుకొని దినమొలతో గాడిదనెక్కి మనుష్యునిపుఱ్ఱెలో కల్లుపోసికొని త్రావుచు దక్షిణదిక్కుగాఁ బోవుదును'' అని ప్రతిజ్ఞ చేసెను. అంత విశ్వామిత్రుఁడు "నేనాతని బొంకింప లేనైతినేని నేనిదివఱకుఁ జేసిన తపస్సులో సగము హరిశ్చంద్రుని కిచ్చి చిరకాల మతనిచే భూమిఁ బాలింపంజేసి తుద కింద్రుని యర్ధసింహాసనమునఁ గూర్చుండఁ జేసెదను'' అని భూమియదరునట్లు పలికెను. అంత మును లెవరియాశ్రమములకు వారు పోయిరి.

విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని బొంకింప దీక్షగలవాఁడై యాతని మందిరమునకుఁ బోయి యాతనిచే సత్కృతుఁడై యాఁగదక్షిణ నిమ్మని కోరెను. ఎంతధనము కావలయునని రాజేడుగఁగా ఏనుఁగుమీఁద మనుజుఁడెక్కి యొకమాణిక్యమును సత్తువకొలఁది పై కెగుర మీఁటిన నది యెంతయెత్తు పోవునో

పెట్టుకొనిరి. అతఁడంత నుగ్రుఁడై వచ్చి రాజుతలపై కిరీటమును బడఁదన్నెను. రాజు వినయముతోఁ బ్రార్థించెను. ముని శాంతి నొంది నాముద్దుఁగూఁతు లగు నీ మాతంగకన్యలను వివాహ మాడమని కోరెను. రాజ్యమైన నిచ్చెదనుగాని నేనట్లు చేయఁ జాలనని హరిశ్చంద్రుఁడనఁగ రాజ్యమిమ్మని విశ్వామిత్రుఁ డడి గెను. మాట దిరుగఁజాలక రాజ్య మాతనికిచ్చి మంత్రియగు సత్యకీర్తినాతనితో, బొమ్మనియాజ్ఞాపించెను. మంత్రి మిగుల దుఃఖించెను. రాజు మునియొద్ద సెలవు తీసికొని పోఁబోవు చుండఁగా "మీకాభరణము లేల? అన్నియు నిం" డని వారి యాభరణము లన్నియు నొలుచుకొనెను. అంత రాజు పోఁబోవుచుండఁగా "బ్రాహ్మణవిత్తము హరించి పోయెదవా? నేను నీయొద్ద మున్ను యాగార్థమై దాఁచుకొనిన సొత్తి"మ్మని కోరెను. "అది రాజ్యములోనిదే" యని హరిశ్చంద్రుఁడనఁగా "కా"దని ముని యనెను, "సరే! యట్లయిన భార్యాపుత్త్రులను నన్ను అమ్ముకొనియైన నీఋణముతీర్చెద" నని రాజు మునికి మాఱుపలికెను. నారాజ్యములో నీవు ధనము సంపాదింపఁ గూడదని మునిపలుక "దేవాదాయములు మీవికావు గావున గాశిలో నేను ధనము సంపాదించి మీకొసఁగెద" నని రాజు మునితో బాసచేసెను. "నీనమ్మకము నాకేమి? నీతోఁగూడ నావాని నొక్కనిఁ బంపింతు"నని తనశిష్యులలోఁ బరమ దుష్ట స్వభావుఁ డగు నక్షత్రకుని వారితోఁగూడఁ గాశికిఁ బంపెను.

రాజు, భార్య చంద్రమతియుఁ, గొడుకు లోహితాస్యుఁడును నక్షత్రకుఁడును, కాలినడకతోఁ గాశికిఁ బయనమైరి. దారిలో విశ్వామిత్రుఁడు వారి కనేకకష్టములు గల్పించెను. హరిశ్చంద్రుఁ

డసత్యమాడువాఁడు కాఁడు. కావున, నాతనిఁ జంపినైనఁ, దన కవమానముగాకుండఁ గాచుకొనవలయునని విశ్వామిత్రుఁ డాతనికి బేతాళునితో యుద్ధము సమకూర్చెను. మహాశూరుఁ డగురాజు బేతాళుని వధించెను. అంత విశ్వామిత్రుఁడు కారు చిచ్చును గల్పించి చక్రవర్తిని దారపుత్త్రులతో దహింపనెం చెను. కాని మహాసాధ్వియగు చంద్రమతి ప్రార్థనలచేఁ జండ వీతిహోత్రుఁడు చల్లఁబడెను. ఇట్టి మహాకష్టములఁ బడి తుదకు వారు కాశిని జేరిరి.

హరిశ్చంద్రుఁ డచటఁ దనభార్యను కాలకౌశికుఁడనుబ్రాహ్మ ణునకు విక్రయించెను. లోహితాస్యుని విక్రయింపకున్నను ఆ బ్రాహ్మణుఁడు గోవత్సన్యాయముచేఁ జంద్రమతితోఁ గూడ నతనిని దీసికొని పోయెను. తన్ను వీరబాహుఁ డను చండాలున కమ్ముకొనెను. అతఁ డాతనిని శ్మశానమునఁ గాపుంచెను. ఇట్లు వచ్చినధనము నక్షత్రకున కిచ్చి విశ్వామిత్రుని ఋణము తీర్చుకొనెను.

కాలకౌశికునిభార్య కలహకంఠి. ఆమె మిక్కిలి గయ్యాళి. మహాసుకుమారి యగు చంద్రమతిచే నన్ని యూడిగములు చేయించుకొనుచుండెను. బ్రాహ్మణ శిష్యులతో రాజబాలకుఁ డగు లోహితాస్యుఁ డడవికిఁ బోయి సమిధలు, పర్ణములు దెచ్చుచుండెను. ఒక్కనాఁడడవిలో రాజబాలుఁడు సర్పదష్టుఁ డై మృతిబొందెను. ఆసంగతి బ్రాహ్మణశిష్యులచేఁ జంద్రఁ మతి తెలిసికొనెను. కాని యింటిలోఁ బనులు పూర్తియగు వఱకును గృహమువదలుటకుఁ గలహకంఠి యొప్పుకొననందున, రాత్రియగువఱ కన్ని పనులొనర్చి, యడవి కొక్కతెయు

నేడ్చుచుఁ గుమారునిఁ జూడఁబోయెను. అనేకవిధముల వగచి యాబాలునిబుజములమీఁదనుంచుకొని శ్మశానభూమికిఁ దెచ్చి యక్కడఁబెట్టి వానికి దహనసంస్కార మొనర్పఁ బ్రయత్నించెను. అంతశ్మశానపుఁగావలివాఁడగు హరిశ్చంద్రుఁడాయెడకు వచ్చి మాడ యీకుండ దహింపరాదని యామెతోఁ జెప్పెను. 'నాయొద్ద నేమియు లేదు, రక్షింపు'మని యామెదీనవదనయైబతిమాలఁగా "నీమెడలోని మంగళసూత్రమమ్మి మాడను దెచ్చుకొ"మ్మని హరిశ్చంద్రుఁ డనియెను. ఆమాటలు విని చంద్రమతి యాశ్చర్యపడి తనమంగళసూత్రము తన భర్తకొక్కనికిఁ దక్క వేఱువారికిఁ గనఁబడదని యామె యెఱిఁగియుండుటచే నాతఁడే తనభర్తయని తెలిసికొని యాతని పాదములపైఁబడి యేడ్చెను. రాజును నామెయుఁ బుత్త్రమరణమునకు మిగుల వగచిరి. "తెల్లవాఱఁ బోవుచున్నది. త్వరితముగఁ బోయి కాలకౌశికునియింటిలోఁ బనులు చేసికొనవలసియున్నది. కావున గుమారునివేగదహింపు" మనిచంద్రమతిభర్తనుజూచి యేడ్వఁగా నాతఁడు "మాడ నీవు తీసికొనిరాకుండ నేనట్లు చేయుట స్వామిద్రోహము గావున, నీవు వెంటనేపోయి కాలకౌశికునడిగి యొకమాడను దెచ్చుకొను" మని భార్యతో ననియెను. ఆమె గ్రామములోనికిఁ బోయెను.

ఇంతలో విశ్వామిత్రుఁడొక రాక్షసునిఁ బిలిచి "నీవుమాయా రూపమునఁ బోయి కాశీరాజుకొడుకును జంపి యా పిల్లవాని మీఁదనున్న సొమ్ము లన్నియు, దెచ్చి చంద్రమతి యొడిలోవేసి పొ"మ్మని చెప్పెను. వాఁడట్లుచేసెను. చంద్రమతినిరాజభటులు పట్టుకొని రాజునొద్దకుఁ దీసికొనిపోయిరి. రాజామెకుశిరశ్ఛేదన

శిక్షవిధించెను. తలారులామెను శ్మశానమునకుఁ దీసికొని వచ్చి హరిశ్చంద్రున కప్పగించిరి. హరిశ్చంద్రుఁడు తనభార్యను దెగనఱకవలసివచ్చెను. ఒఱనుండి కత్తిదూసి పట్టుకొని కన్నీరు కాల్వలై పాఱఁగ నేమియుఁ జేయలేక యూరకుండెను. అంతఁ జంద్రమతి "ప్రాణేశ్వరా! ఇది మీకు దుఃఖింప సమయము కాదు. సత్యము తప్పనివాఁడ నను శాశ్వతకీర్తిఁగాంచే సమయము వచ్చినది. నాకై విచారింపఁ దగదు. నేను శిశుఘాతుకురాల ననునిందనొందితిని. నేనింక బ్రతుకఁదగదు. నీచే నాకుఁ జావువచ్చుటచే నేను మహాదృష్టవంతురాలను. సందేహింపకుము" అని పలుకఁగా ధైర్యము తెచ్చుకొని కత్తితో నొక్కవ్రేటామె మెడపైనై చెను. ఆవ్రేటు తగులలేదు. తిరిగి కత్తియెత్తి మఱియొకవ్రేటు వ్రేసెను. అదియుఁ దగులలేదు. ఇదేమని యాశ్చర్యమొంది హరిశ్చంద్రుఁడు "నేనేయాడితప్పనివాఁడనైన యెడల నీవ్రేటు తగులక తప్ప"దని కత్తియెత్తుసరికి శంఖచక్రగదాధారి యగు శ్రీమన్నారాయణుఁడు వెనుకకు వచ్చి కత్తిబట్టుకొని "నిలునిలు! హరిశ్చంద్రా! నీ సత్యమునకు దేవతలందఱు సంతోషించుచున్నారు. నీమనశ్శుద్ధి పరీక్షించుటకై విశ్వామిత్రుఁ డీమాయలను జేసెను. నీవే గెలిచితివి. విశ్వామిత్రుఁ డోడెను. వరమిచ్చెదను, కోరుకో"మ్మని పలుక, నాతఁ డాదయామయునకు మ్రొక్కి యూరకుండెను. అంత విశ్వామిత్రుఁడు వచ్చి రాజును గౌగిలించుకొని క్షమింపుమనివేఁడి, తనతపములో సగము ధారపోసి, కాశీరాజుకొడుకును బ్రదికించి, యయోధ్యారాజ్య మంతయు హరిశ్చంద్రున కిచ్చివేసెను పీతాంబరుఁ డంతర్ధాన మొందెను. హరిశ్చంద్రుఁడు

త్రిశంకుని కొడుకు ఆర్గురు చక్రవర్తులలో నితఁడు మొదటి వాఁడు మిగిలినవారు నలుఁడు, సగరుఁడు, కార్తవీర్యుఁడు, పురుకుత్సుఁడు, పురూరవుఁడు.

---

## 25. ఇద్దఱు పథికులు గండగొడ్డలి.

బాటసారు లిద్దఱు కడుస్నేహముతోఁ గలిసి దూరప్రయాణము చేయుచుండిరి. అట్లు పోవుచుండఁగా మార్గమం దొకచోటఁ బ్రశస్తమైన యొక పరశు వొకనికి గాన్పించెను.

అంతట నతఁడు దాని చేతితోఁ బైకెత్తి "అన్నా! నాకొక గండగొడ్డలి దొరకిన" దనెను. రెండవవాఁడు కష్టసుఖములలో సమభాగముగా నుండి యిన్నాళ్లు ప్రయాణము చేయుచుంటి మికదా! నాకు దొరకిన దనకుండ మన కనరాదా?" యని పలికెను.

వారంతఁ గొంతదూరము మాటలాడుకొనకుండ సాగిపోవుచుండఁగా, ఆగొడ్డలిహక్కుదారు వారిని వెనుకొని పరుగెత్తి వచ్చుచుండెను గొడ్డలితీసినవాఁడది చూచి "అయ్యో! అదిగో గొడ్డటివాఁడు మనలను దఱుముకొని వచ్చుచున్నట్లున్నాఁడు. ఇంక మనపని సరి" యనిచెప్పెను.

అంతట రెండవవాఁడు మందహాసముతో నిట్లనెను. "మిత్రమా! వెనుక నట్లంటివా యిప్పుడు నట్లె యనరాదా? సర్వనామముల నిప్పుడు సవరించెదవేల? మనలను-మన అనుటకు మాఱు నన్ను అనియే వచింపుము."

కష్టముల నొరులకుఁ బంచిపెట్టఁగోరువారు సుఖములలోఁ గూడఁ బాలిచ్చుట కొప్పుకొనవలెను.

# 26. మేఘోత్పత్తి, వర్షము.

శీత కాలమున నుదయమున లేచి వీధిలోనికివచ్చి **మాటలాడి** నప్పుడు నోటికిఁ గొంచెము సమీపముగా గుప్పుగుప్పునఁ బొగ చిమ్మినట్లు తెల్లయావిరి క్రమ్ముట మన మందఱ మెఱిఁగిన **దే.**

బడిపిల్లలు పలకమీఁద నూఁదినప్పు డది చెమ్మగిల్లుటయుఁ జూచుచున్నాము.

మఱుఁగుచున్న నీళ్ల కాఁగుమీఁదమూఁత తీసివేసినప్పుడు దానిమూఁతి క్రిందుగ పైని తెల్లపొగలాగున నొకటి బయలు దేఱుట నిత్య మిండ్లలోఁ జూచునదియే.

కొంచె మాలోచించిన వీని కన్నిటికిని కారణము కనిపట్ట వచ్చును.

నోటినుండి విడిచిన యుచ్ఛ్వాసములోను, కాఁగునీళ్లనుండి పైకివచ్చు ఆవిరిలోను, వెచ్చని వాయురూపమైన జలమున్నది. ద్రవరూపమైన యుదకమును జూడఁగలము. అదియే వాయు రూపముగా నున్నఁ జూడలేము. వెచ్చని నీటియావిరి చల్లని పదార్థములఁ దాఁకిన, ఘనీభవించి మఱలఁ జిన్నచిన్న జలకణ ములుగల తుషారముగా మాఱును. నోటినుండియు కాఁగు మీఁదినుండియు వచ్చుపొగయును, పలకమీఁది చెమ్మయును ఇట్టి చిన్నజలబిందువులవలన నేర్పడిన తుంపరలె. కనుక, నుష్ణ ముచే దృశ్యమైన జల మదృశ్యమైన యావిరిగాను, శైత్యము చేత నదృశ్యమైన నీటియావిరి తిరుగ దృశ్యమైన జలబిందువు లుగాను మాఱు నని దీనివలన స్పష్టము.

ఘోరవంతములై వానివలన జీవించు ప్రాణిసంతతికి, నిరుపయోగములగును. అప్పుడు కురియుచున్న వర్షములే యట్లు జెరుగకపోవుటకుఁ గారణము.

ప్రపంచమంతటను వఱపెప్పుడు నుండదు. ఒకచోట అనావృష్టియున్న మఱియొకచోట అతివృష్టి యుండును. బాగుగ వర్షించుచుపట్టుల నొకటి రెండు సంవత్సరములు వరుసగా వఱపును గఱవును బట్టినను, దరువాతఁ బూర్ణవృష్టిచే ఆలోటు పూర్ణముగాఁ దీఱుచుండును. ఇట్లు విషమస్థితులఁ దిన్నఁబఱుచుచు అనాదినుండి యీ యపార సంసారమును సవరించుకొనుచున్న జగత్కుటుంబి యగు సర్వేశ్వరుని నిపుణతామహిమను బొగడుటకు వేయినోళ్లైనఁ జాలవు.

ఎంత పరికించినను సృష్టిలోఁ బూర్వమున్న పదార్థమే కాని క్రొత్తపదార్థము గానరాదు. క్రొత్తదిగాఁ గనఁబడునది పూర్వవస్తు వికారమే కాని వేఱొకటిగాదు. ఆవిరి నీటియొక్క వికారము. మేఘము లావిరియొక్క పరిణామము. మేఘసంచయము యథాపూర్వముగ నీరయి వర్షరూపమున సరస్సటాకాదులలో గలియుచున్నది. ఈచక్రపరివర్తనము సృష్టిచిత్రములలో నొక విచిత్రము.

---

## 27. పొట్టిబాతులు, పెద్దబాతులు, హంసలు.

బాతులును హంసలును ఒక్కజాతిలోని పక్షులు. బాతులలోఁ బెద్దపనియుఁ జిన్నవనియు రెండు తెగ లున్నవి.

ఈ పక్షుల కన్నిటికిని వ్రేళ్లనడుమఁ బలుచని చర్మముండును. పడవతెడ్లవలె నీపక్షు లట్టికాళ్ల నుపయోగపఱచు

కొని నీళ్లలోఁ జక్కగానీదుఁను. వక్షస్స్థలము విశాలమైన వర్తులమై యుండును. పృష్ఠభాగము క్రమముగా సన్నగిల్లి ఆఁదోఁక గానుండును. ఈక లొత్తుగానుండును. వానికి నీరంటదు. కాళ్లి తరపక్షులకంటెఁ గొంచెము వెనుకకుండును. ఇవియన్నియు సులభముగా ఈఁదుటకు మిక్కిలి సహకారులగును.

గ్రుడ్లనుండి యీవలికి వచ్చిన కొలఁదికాలములోనే వీని పిల్లలిట్టటు తిరుగును. వాని శరీరములమీఁద మృదువైన చిట్టీక లుండును. వానికాళ్లు పొట్టిగా నుండును.

ముక్కు వంగక తిన్నగా నుండును. ప్రక్కలకు సాఁగి వెడల్పుగా పొలసు పొరలతో నుండును.

ఈపక్షులు సాల నకొకటి రెండుసాటిపిల్లల రాల్చుకొనును.

ఇవన్నియు నీటిపక్షులు గనుకఁ, సహజముగా నీటిపట్లయందే గుంపులు గుంపులుగా నివసించును.

వీనిలోఁ బెద్దబాతులు విశేషముగా నీటిమొక్కలుభక్షించి బ్రతుకుచున్నను, మొత్తముమీఁద ఈజాతిపక్షులు చేఁపలు, నత్తలు,గింజలు మొదలగు నానావిధాహారములనుభుజించును.

ఈపక్షు లొక్కచోటనే స్థావరముగా నుండక పరభూములకు వలసపోవుచుండును.

## పొట్టిబాతులు.

ఈ జాతిపక్షులలో ఇవి చిన్నవి కావుననే వీనికి పొట్టిబాతులని పేరు. పెంపుడు బాతులపాదములు పసపు బచ్చగాను దక్కినవానివి నల్లగాను నుండును. సామాన్యముగా నివి బూడిద రంగుగా నుండును.



పొట్టిబాతులు మట్టిలోని గింజలను పురుగులను కొక్కరించుకొని తినును.

ఊళ్లలో నూతులయొద్దను గుంటలయొద్దను చెఱువులలోను ఇవి గాన్పించును.

పొట్టిబాతులు గుమిగూడియున్నప్పు డెవరైన నొకదానిని గొట్టినఁగాని పట్టుకొనినఁగాని తక్కినవి తప్పించుకొని పాఱిపోక దానిచుట్టు అఱచుచు చక్రములు దిరుగును. కనుక వేఁట కాండ్రకుఁ బొట్టిబాతులఁ బట్టుకొనుట సుకరము.

"ఐడరు" అను నొకజాతి బాతుయొక్కతూలిక లతిమృదులములు. కనుక ధనవంతులును భోగులును ఎక్కువడబ్బు పెట్టి వానిని కొందురు.

## పెద్దబాతులు.

ఇవి పొట్టిబాతులకంటెఁ బెద్దవి. హంసలకంటెఁ జిన్నవి. ఆరెంటికంటె నెక్కువ స్థలసంచారముచేయునవి. వానిముక్కు క్రమముగా సన్నగిల్లి కొంచెము బొగడ దేఱియుండును.



వీనిమాంసమెంతో రుచిమంత మఁట. ఈ బాతులను పెక్కురు పెంతురు.

పెద్దబా తెగురుటలో మొట్టమొదటఁ గ్రిందఁ గొంచెము కష్టపడినను పైకిఁ బోయినకొలఁది సులువుగా వేగముగా నెగురఁగలదు.

ఈజాతిబా తొక దానితోనే జోడుకట్టును. ప్రయాణము చేయునప్పు డేఁబదేసి నూటేసి యాకాశమున నొకదాని వెనుక నొకటిబారు కట్టిపోవును. ఇట్లు పోవుటవలన శ్రేణిముఖమందున్న పక్షికే గాలిని జీల్చుకొనిపోవు నాయాస మెక్కువగానుండును. వెనుకటివాని కేమియు లేదనియే చెప్పవచ్చును. మొదటిది యలసట చెందినతోడనే వెనుకకుఁ బోవును. వెనుకది ముందు నకువచ్చును. ఇట్లు ముందు వెనుకలు మార్చుకొని యొకదాని కొకటి సాహాయ్యము చేసికొనుచు నొక్కొక్కప్పుడు పగలంతయు విశ్రాంతి యన్నమాటయే లేకుండ నవి దూరప్రయాణము చేయును. దారితీయు ముందటిపక్షి "మీరందఱు క్షేమ

ముగా వచ్చుచున్నారా" యని యడుగున ట్లప్పుడప్పు డఱచు చుండును. "వచ్చుచున్నా"మని ప్రత్యుత్తర మిచ్చినట్లు వెనుకవి గలిసి మరల పఱచుచుండును. ఆహా! పక్షిజాతులు గూడ నెట్టిబుద్ధివిశేషమును ఎట్టియైకమత్యమును గనఁబఱచుచున్నవి.



హంసలు.

హంసలు తెల్లగామాత్రమే యుండునని యనుకొనరాదు. ఆస్ట్రేలియాలో నల్లనిహంసలును గలవు. శిరస్సు గంఠము నల్లగాను కొదవభాగములు తెల్లగాను నుండు హంసలుకూడఁ గలవు.

హంస లన్నిటికిని సన్ననిపొడుగైన మెడయుండును. దానినవి యెట్లు వంచవలె నన్న నట్లు వంపఁగలవు.

హంసయు హంసియు దాదాపొక్కరీతిగానే యుండును.

ఇవి బాగుగా నెగురఁగలవు.

బాతుకలకంటె నెక్కువ తఱచుఁగాఁ బూర్ణ జలాశయములందు మసలుచుండును. సాధారణముగా బాతులుతిను ఆహార పదార్థములే యివియుఁ దినును.

వానివలెనే తెల్లహంసలు శీతకాలములో గుంపులుఁ గుంపులుగా నుండును. వలస పోవునప్పుడు పగలు రాత్రియుఁ గూడ ప్రయాణముచేయును.

అవి గ్రుడ్లను పొదుగుటకు రెండునెలలు పట్టును. పెద్దబాతులు నూఱేండ్లును హంసలు మూఁడువందలయేండ్లవఱకును బ్రతుకు నని చెప్పుదురు.

హంస తనస్వాభావికవాసస్థానమగు నీటిని వదలి భూమిమీఁద నడచునప్పు డెంతవికృతాకారముగా నుండునో, నీటిలో మెడ కులుకుతోఁ, బలువిధములైన గతులతో, ఒయ్యారముగా, అశ్రమముగాఁ, బోవునప్పుడు చూచుట కంత మనోహరముగా నుండును. ఆ శృంగారయాన మెంత చూచినను ద్రష్టలకుఁ దనివితీరదు. అందుచేతనే యొయ్యారముగా నడచు సుందరాంగిని హంసగమన యనియు అంచేయాన యనియు వర్ణింతురు.

నీటిపక్షులలో హంసయంత యందమైనపక్షి మఱియొకటి లేదు. కనుకనే గొప్పవారు విలాసార్థ ముద్యానవనములలోఁ గొలఁకులు త్రవ్వించి యందులో హంసలను బెట్టి పెంతురు.

---

## 28. లూయీకార్నేరో.

వెనిసు పట్టనములో లూయీకార్నేరో యను నొక గొప్ప కుటుంబములోనివాఁ డుండెను. తోడిగొప్పవారివలె నతఁడును నలువదియేండ్లవయస్సు వచ్చువఱకు నమితముగా భుజించి యెక్కువగఁ ద్రాగుచుండెను. అందువలన నాసరోగముతోనో

కాళ్లవాఁపుతోనో, జ్వరముతోనో, యేదోయొక జేబ్బుతో నతఁడెప్పుడును బాధపడుచుండెను. జేబ్బుచేమూలుగని రోజో క్కటియైన నుండెనో లేదో సందేహము.

ఇట్లుండి చివరకు వైద్యుల సలహా ప్రకారము తన ప్రవర్తన మంతయు మార్చుకొని మితభోజనమితపానములలో నింతటి వాఁడు లేఁడను ఖ్యాతిఁ గాంచెను. ఒక్కసంవత్సరములో నన్ని రోగములు నెగిరిపోయెను.

అంతటఁ బ్రతిదినము పండ్రెండౌన్సుల గట్టియాహారమును బదునాలు గౌన్సుల లఘుద్రావాహారసమును మాత్రమే పుచ్చు కొందు నని యొక నియమము చేసికొనెను. ఈస్వల్పాహారము పెక్కుజనుల జీవనాధారమునకై చాలక పోవచ్చును; కాని కార్నెరో పూర్ణారోగ్యముతో దీర్ఘకాలము జీవించుటకు సరి కాయెను.

డెబ్బదవయేఁట నతఁడు పడుటవలన నొకబుజమును నొక కాలును విఱిగిపోయెను; అనేకు లావయస్సులో నట్టిదెబ్బతిని దేవేంద్రలోకము చూడవలసినవారే; కాని యారోగ్యవంతుఁ డును దృఢగాత్రుఁడు నైన కార్నెరో కట్లు జేరుగలేదు. అతి స్వల్పకాలములోఁ గాలును జేయియు నతుకుకొనెను. బాధ నిమ్మళించెను.

ఎనుబదిమూఁడవయేఁట నతఁడు ధారాళముగఁ గొండ లెక్కెడువాఁడు. భూమిమీఁదినుండి యసహాయుఁడై గుఱ్ఱము మీఁది కెగిరెడివాఁడు. మనోదార్ఢ్యమును దేహదార్ఢ్యము నకుఁ దీసిపోలేదు. అంత వయస్సులోఁ గూడఁ బ్రహసనగ్రంథ ములు వ్రాయఁగలిగెను. యావజ్జీవము నవ్వుచుఁ బ్రేలుచు

నిత్యసంతోషముతో నుండి బాలక్రీడలలోఁ దాను నొక బాలునివలెఁ జేరఁబడుచుండెను.

మితభోజియు, మితపాయియు నైన కార్నేరో వృద్ధుఁడయి తొంబదియెనిమిది సంవత్సరములు జీవించి ప్రశాంతమైనట్టియు అనాయాసకరమైనట్టియు మరణమును బొందెను.

---

## 29. మిణుఁగుఱుఁబురుగులు.

ఆ. చేదలు గప్పునుండి జెలజెల నేలను
రాల మఱలఁ బైకిఁ దూలునట్టి
చుక్కలాయి వన్ని ? చుక్కలుగా వవే !
యన్నిచుక్కలున్న యాకసమున. 1

ఆ. కాక, భూమిదేవి కప్పఁజీఁకటికొప్పు
రకపునగలతళుకు రవలో యేమొ ?
కావు కావు రవలు గా! వివ్వి రవలైన
నట్లు కదలఁగలవె యిటుకు నటకు? 2

ఆ. చూడఁజోడ నివ్వి సుందరమైనట్టి
సృష్టిలోన మిగులఁ జిత్రమైన
పురువులట్లు తోఁచు బుద్ధికి; నీపుర్వు
లట్టి వెన్నఁ డేచేట నరయ లేదు. 3

ఆ. మినుకుమనుకు మనుచు మింటిపై కెగురును
దళుకుమనుచుఁ దిరుగ ధరకువచ్చుఁ,
బట్టఁబోవఁ బట్టు వడ; వింతపుర్వుగా !
యంతకాంతి యెట్లు లందఁగలిగె ? 4

ఆ. చిత్రమైనపూల § చెట్లను, మగువల
సుందరాకృతులను § జూపి పగలు
సృష్టిలోన నింత § చిత్రమాదాని, నో
తరుణి ! చెప్పు మేల § దాఁచె దీవు ? 5

గీ. పుంతలను బోవువారి కే § ముండ్లు గ్రుచ్చు
కొనునో; యేబాధవచ్చునో § యనుచు ముందు
వేయుదువు చిఱుదివ్వటీ § ల్వింతపురుగ !
ఇలను నీవంటి యుపకారి § యెవఁడు గలఁడు ? 6

గీ. వింతపురు గని నిన్నంట § వింతగాదు
చేమురు వత్తియు నిప్పు నెక్కచ్చుటను లేని
వింతదీపాలు దాల్చి కా § వింతు కాదె
యెచేటఁ గనరాని యుపకార § కృత్యములను ! 7

ఆ. ఎవనిదీపమైన § నెగఁద్రోయ దిగఁదీయఁ
గరముఁ బుడుక రెండు § గావలెఁగద !
యింకనీదుకాంతి § హెచ్చింపఁ దగ్గింప
నీదు మనసు దక్క § లేదొకండు. 8

గీ. సులభముగఁ బట్టువడ; వైనఁ § జూచి నిన్ను
బాలకులు వెంటఁబడి చేతఁ § బట్టుకొనఁగఁ
బర్వులిడియిడి యెట్టులో § పట్టి నలిపి
త్రొక్కిచంపుదు రెంతటి § క్రూరులయ్యొ 9

గీ. నలిపినకొలందిఁ దేజంబు § లొలుకుచుండు,
వంతయేకాని యిసుమంత § హాని చేయ;
విట్టిశాంతోపకారిని § గిట్టఁజేయు
టెంతపాపమొ బాలకు § లెఱుఁగఁ రకట ! 10

గీ. ఆకుపచ్చ్చగ నుంటచే నాకుమీఁది
పురుగు, హాంతలు సుళువుగా నరయ లేదు
కటికిచీఁకటిలో నిట్టి కాంతి యేల
పుట్టె నయ్యయ్యొ మిణుఁగుఱుఁ బురుగ నీకు ! 11

గీ. కారు మెకమును రాకుండఁ గాచుకొనుటఁ
కడవుల నెగళ్లు వేయు బోయలటు లీవు
తెలియకుండఁ బైఁ బడి భ్రమింగు చిలిపిజంతు
రాజి బెదరింపఁ జిచ్చులు గ్రక్కెదేమొ ! 12

గీ. పుట్టిన సమస్తజంతువుల్ గిట్టు నెపుడొ
జన్మ మన్నను నీది యేజన్మ మిలను,
బ్రతుకునది మూఁడునాళ్లైనఁ బరుల కెపుడు
మేలు చేయుచు బ్రతికెదు మిణుఁగుఁబురుగ ! 13

గీ. ఉసురు లున్నంతవఱకె యే యోగ్యుఁడైనఁ
బరులయుపకృతికై పాటుపడును గాని
చేలుపు దుపకారమును నీవు చేచ్చికూడఁ
బక్షిపురుటాలిగూఁటిదీపంబ వగుచు !

---

# 30. భాగవతములోని పద్యములు.

## స్యమంతకమణి—సత్యభామ.

వ. శుకుం డి ట్లనియె. 1

క. సత్రాజిత్తు నిశాచర
శత్రునకుం గీడు సేసి సద్వినయముతోఁ
బుత్త్రి స్యమంతకమణియును
మైత్త్రిం గొని తెచ్చి యిచ్చె మనుజాధీశా ! 2

వ. అనిన విని రాజి ట్లనియె. 3

ఆ. శౌరి కేమి తప్పు సత్రాజితుఁడు సేసె
గాఁతు మణిని నేల కోరియిచ్చె
నతని కెటులు గలిగె నాస్యమంతకమణి
విప్రముఖ్య ! నాకు విస్తరింపు. 4

వ. అనిన విని శుకయోగివర్యుండి ట్లనియె, సత్రాజిత్తనువాఁడు
సూర్యునకు భక్తుండై చెలిమిసేయ నతనివలన సంతసించి,
సూర్యుండు స్యమంతకమణి నిచ్చె, నామణి కంఠంబున
ధరియించి, సత్రాజిత్తు భాస్కరునిభంగి [1]భాసమానుండై
ద్వారకానగరంబునకు వచ్చిన, దూరంబున నతనిం జూచి
జనులు[2]మణిప్రభాపటల తేజోహృతదృష్టులయి, సూర్యుం
డని శంకించివచ్చి హరి కి ట్లనిరి. 5

క. నారాయణ ! దామోదర !
నీరజదళనేత్ర ! చక్రి ! నిఖిలేశ ! గదా
ధారణ ! గోవింద ! నమ
స్కారము యదుపుత్ర ! నిత్య కల్యాణనిధీ. 6

మ. దివిజాధీశ్వరులిచ్చఁగింతురుగదా దేవేశ ! నిన్ జూడ యా
దవవంశంబునగూఢమూర్తివిజగత్త్రాణుండ వై యుండఁగా

---

1. భాసమానుఁడు=ప్రకాశించుచున్నవాఁడు. 2. మణిప్రభాపట
ల తేజోహృతదృష్టులు=మణియొక్క కాంతిపుంజపు, తీక్ష్ణతచేత హరింప
బడినచూపులు గలవారు (స్యమంతకమణిదీప్తిచేఁ) గన్నులు మిఱుమిట్లు
గొన్నవారు-కన్ను చెదరినవారు 3. గదాధారణ = గదనుధరించువాఁడా
హరీ !

భవదీయాకృతిఁ జూడ నేఁడిదె! [4]రుచిప్రచ్ఛన్నదిగ్భాగుఁడై
రవియో నీరజగర్భుఁడో యొకఁడు సేరస్వచ్ఛమార్గంబునన్.

వ. అని యిట్లు బలికినమూఢజనులం జూచి, గోవిందుండు నగి మణిసమేతుండైన సత్రాజితుండుగాని సూర్యుండుగాఁడని పలికె, నంత సత్రాజితుండు శ్రీయుతంబయి మంగళాచారసంచారంబైన తనగృహంబునకుం జేని, మహీసురుల చేత, నిజదేవతామందిరంబున, నమ్మణిశ్రేష్ఠంబు ప్రవేశంబు సేయించె, నదియును బ్రతిదినంబు నెనిమిదిబారువల సువర్ణంబు గలిగించుచుండు. 8

క. ఏ రాజేలెడు వసుమతి
నారత్నము [5] పూజ్యమానమగు నక్కడ రో
గారిష్టసర్వమాయిక
మారీదుర్భిక్షభయము మాను నరేంద్రా ! 9

క. అమ్మణి యాదవవిభునకు
ని మ్మని హరి యడుగ నాతఁ [7] డీక ధనేచ్ఛం
బొమ్మని పలికెను; జక్రికి
నిమ్మణి యీఁకున్న మీఁద నే మా ననుచున్. 10

వ. అంత. 11

---

4. రుచిప్రచ్ఛన్నదిగ్భాగుఁడు = కాంతిచేఁ గప్పబడిన దిక్ప్రదేశములుగలవాఁడు (కాంతి నాలుగువైపులను వ్యాపించినవాఁడు) 5. పూజ్యమానము=పూజింపఁబడుచున్నది. 6. రోగారిష్ట సర్వమాయికమారీ దుర్భిక్షభయము=రోగము, కీడు, ఎల్లమోసగాండ్రు, (స్ఫోటకము మున్నగు) అమ్మవారి జబ్బులు, కఱవు—వీనివలనఁ గలిగిన భయము; 7. ఈక = ఈయక.

చ. అడరెడు వేడ్కఁ గంఠమున
నమ్మణిఁ దాల్చి ప్రసేనుఁ డొక్కనాఁ
డడవికి ఘోరవన్య [8]మృగ
యారతి నేగిన వానిఁ జంపి పైఁ
బడి మణిఁ గొంచు నొక్క [9]హరి
పాఱఁగ దాని వధించి డాసి యే
ర్పడిఁ గనె జాంబవంతుడు
[10]ప్రభాత్తదిగంతము నాస్యమంతమున్. 12

క. కని జాంబవంతుఁ డా మణిఁ
గొనిపోయి సమీపశైలగుహఁ జొచ్చి ముదం
బునఁ దనకూరిమి సుతకును
ఘనకేళీకందుకంబుగాఁ జేసె నృపా! 13

వ. అంత సత్రాజితుండు తనసహోదరుండైన ప్రసేనునిం
గానక దుఃఖించుచు. 14

మ. మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో
మావాఁడు వర్తింపఁగా
మణికై పట్టి వధించినాఁడు హరికిన్
మర్యాద లే దంచు దూ
షణముం జేయఁగ వానిదూషణముఁ గం
సధ్వంసి యాలించి యే

---

8. మృగయారతి=వేఁటయందాసక్తి. 9. హరి=సింహము, 10, ప్రభాత్తదిగంతము=కాంతిచే పొందఁబడిన (కాంతి వ్యాపించిన) దిగంతములు గలది—దిక్కుల చివరవఱకు వ్యాపించినకాంతి గలది.

[11]ప్రణమ్ముగా నాయెడ లేదు నింద గలిగెగా
వారించు టేరీతియో? 15

వ. అని వితర్కించి. 16

మ. తనవా రెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం, దర్కించుచుం గా వచ్చి త
ద్వనవీథిం గనె నేలఁ గూలినమహా శ్వంబుం, బ్రసేనుం, బ్రసే
నుని హింసించినసింహమ్ముగా, మృగపతిగా నొప్పించి ఖండిచి యే
గినభల్లూకము సొచ్చియున్న గుహయుం, గృష్ణుండు [12]రోచిష్ణుఁడై. 17

వ. కని తన వెంట వచ్చిన ప్రజలనెల్ల గుహాముఖంబున విడిచి సాహసంబున మహానుభావుండైన హరి, నిరంతరనిబిడాంధకారబంధురంబయి, భయంకరంబై, విశాలంబయినగుహాంతరాళంబు సొచ్చి చేని, యక్కడ నొకబాలిక కెదుర [13]దర్శనీయకేళికందుకంబుగా, వ్రేలం గట్టఁబడిన యమ్మణి శ్రేష్ఠంబుఁ గనిహరింప నిశ్చయించి. 18

క. మెల్లనె పదము లిడుచు యదు
వల్లభుఁ డాశిశువుకడకు వచ్చిన గుండెల్
జెల్లనఁగఁ జూచి కంపము
[14]మొల్లంబుగ దానిదాది మొఱవెట్టె నృపా! 19

---

11. ప్రణము=పుండు(దోషము) 12. రోచిష్ణుఁడు=ప్రకాశించువాఁడు. 13. దర్శనీయకేళికందుకంబు=చూడఁ దగినఆటబంతి (శిశువులుచూచి ఆడుకొనుటకై పైని వ్రేలాడఁగట్టిన బంతి) 14. మొల్లంబుగా = అధికముగాఁ

వ. అంత నాధ్వని విని బలవంతుం డై నజాంబవంతుండు వచ్చి
తనస్వామి యని కృష్ణు నెఱుంగక ప్రాకృతపురుషుం డని
తలంచి కృష్ణునితో రణంబు చేసెనందు. 20

క. [15]పలలమునకుఁ బోరెడు డే
గలక్రియ శస్త్రములఁ దరులఁ గరముల విజయే
చ్ఛల నిరువదియెనిమిదిదిన
ములు పోరిరి నగచరేంద్ర ముఖ్యుఁడు హరియున్. 21

క. అడిదములుఁ దరులు విఱిగిన
బెడిదములగు మగతనములఁ [16] బిఱుతివక వడిం
బిడుగులవడువునఁ బడియొడి
పిడికిటిపోటులను గలన [17] బెరసి రిరువురున్. 22

శా. స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియుం
భల్లూకలోకేశుఁడున్
ముష్టీముష్టి నహర్నిశంబు జయస
మ్మోహంబునం బోరుచోఁ
బుష్టిం బాసి ముకుందముష్టిహతులం
బూర్ణశ్రమోపేతుఁడై
పిష్టాంగోరుశరీరుఁడై యతఁడు తా
భీతాత్ముఁడై యిట్లనెన్. 23

15. పలలము=మాంసము. 16. పిఱుతివక = వెనుదీయక, వెనుకకుఁబోక
17. బెరసిరి=వ్యాపించిరి. (వర్తించిరి తిరిగిరి.) 18. ముష్టీ ముష్టిన్ = ఒకరి
నొకరు పిడికిటిగ్రుద్దులు గ్రుద్దుకొనుచు. 19. పిష్టాంగోరు శరీరుఁడు = నలఁగ
గొట్టఁబడిన అవయవములు గల పెద్ద దేహము గలవాఁడు (యుద్ధములో
శరీరమంతయు పిండిపిండి యైనవాఁడు.)

వ. దేవా! నిన్నుఁ బురాణపురుషు, నధీశ్వరు,విష్ణుం, [20] ప్రభ విష్ణు, నెఱుంగుదు. సర్వభూతంబులకుం బ్రాణప్రతాపధైర్యబలంబులు నీవ, విశ్వంబునకు [21] సర్గస్థితిలయంబు లెవ్వ రాచరింతురు వారికి సర్గస్థితిలయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ, యాంతరాత్మకుం బరమాత్మవు నీవ యని నుతియించు. 24

సీ. బాణాగ్ని నెవ్వఁడు • పఱపి పయోరాశి
ఇంకించి బంధించి • యేపుమాపెఁ
బరఁగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశిచే
దానవగర్వాంధ • తమస మడఁచెఁ
గంజాతములు ద్రెచ్చు • కరిభంగి నెవ్వఁడు
దశకంఠుకంఠబృందములు ద్రుంచె
నాచంద్రసూర్యమై • యమరులంకారాజ్య
మునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె

తే. నన్ను నేలినలోకాధినాథుఁ డెవ్వఁ
డంచితోదారకరుణార • సాబ్ధి యెవ్వఁ
డాతఁడవు నీవ కావె మహాత్మ నేఁడు
[22] మాఱుపడి యెగ్గుజేసితి • మఱవ వలయు. 25

వ. అని యిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన నతనిశరీర [23] నిగ్రహనివారణంబుగా భక్తవత్సలుండైన హరి దనకరంబున నతనిమేను నిమిరి మేఘగంభీర భాషణంబుల ని ట్లనియె. 26

---

20. ప్రభవిష్ణువు=సమర్థుఁడు, బలశాలి, 21. సర్గస్థితిలయంబులు=పుట్టించుట, పోషించుట. నాశముచేయుట. 22. మాఱుపడి=భేదపడి, విరోధపడి. 23 శరీర నిగ్రహ నివారణంబుగాన్=ఒడలిబాధ పోవునట్లుగా.

క. ఈమణి మా చేఁ బడె నని
తామసు లొనరించునింద దప్పెడుకొఱకై
నీమందిర మగుబిలమున
కే మరుదెంచితిమి భల్లూకేశ్వర ! వింటే. 27

వ. అనిన విని సంతసించి జాంబవంతుఁడు మణియునుం దన కూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి హరికిఁ గానికఁగా సమర్పించె. నటమున్న హరివెంటవచ్చినవారలు బిలంబువాకిటం బం(డ్రెం)డు దినంబులు హరిరాక కెదురు చూచి వేసరి వగచి పురంబునకుం జేని రంత దేవకీ వసుదేవులును రుక్మిణియును మిత్రబంధు జ్ఞాతి జనులును గుహా సొచ్చి కృష్ణుఁడు రాక చిక్కె నని శోకించి. 28

క. దుర్గమ మగు బిలమున హరి
నిర్గతుఁడై చేరవలయు నేఁ డని పౌరుల్
వర్గములై సేవించిరి
దుర్గం, గృతకుశలమార్గఁ దోషితభర్గన్. 29

క. డోలాయితమానసులై
జాలిం బడి జనులు గొలువఁ [24] జండిక పలికెన్
బాలామణితో మణితో
[25] హేలాగతి వచ్చె నంబుజేక్షణుఁ డనుచున్.

క. యత్నము సఫలంబయిన [26] స
పత్నసమూహములు బెగడఁ బద్ధాత్ముండా
రత్నముతోఁ గన్యాజన
రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్. 31

---

24. చండిక = పార్వతి, 25. హేలాగతిన్ = విలాసముతో, 26. సపత్న సమూహములు = శత్రుబృందములు.

క. మృతుఁ డైన వాఁడు పునరా
గతుఁ డై సక్రియం దలంచి కన్యామణిసం
యుతుఁడై వచ్చిన హరిఁ గని
వితతోత్సవకౌతుకముల వెలసిరి పౌరుల్. 32

వ. ఇట్లు హరి దనపరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి తద్వృత్తాంతం బంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణి నిచ్చె. అతండును సిగ్గుపడి మణిం బుచ్చుకొని పశ్చాత్తాపంబునొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికిం జని. 33

క. పాపాత్ముల పాపములం
బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ
బాపము గల దని నుడివిన
పాపాత్మునిపాపమునకుఁ బారము గలదే. 34

మ. మితభాషిత్వము మాని యేల హరిపై
మిథ్యాభియోగంబు సే
సితిఁ? బాపాత్ముఁడ, నర్థలోభుఁడను, దు
శ్చిత్తుండ, మత్తుండ, దు
ర్మతి, నీదేహముఁ గాల్పనే దురిత మే
మార్గంబునం బాయు? నే
గతి గంసారి ప్రసన్నుఁడై మనుచు నన్
గారుణ్య భావంబునన్? 35

ఆ. మణిని గూఁతు నిచ్చి మాధవుపదములు
పట్టుకొంటి నేని బ్రదుకు గలదు

---

27. మిథ్యాభియోగంబు=అపనింద, లేని తప్పు మోపుట.

సంతసించు నతఁడు, సదుపాయమగు నిది
సత్య మితరవృత్తిఁ జేకుఁబడదు. 36

మ. అని యిబ్భంగి బహుప్రకారముల నే
కాంతస్థుఁడై యింటిలోఁ,
దనబుద్ధిం బరికించి, నీఁతి గని, స
త్రాజిత్తు సంప్రాప్తశో
భనుఁడై యిచ్చె [28] విపత్పయోధితరికిన్
భామామనోహారికిన్
దనుజాధీశవిదారికిన్, హరికిఁ, గాం
తారత్నమున్ రత్నమున్. 37

ఉ. తామరసాక్షుఁ డచ్యుతుఁ డు
దారయశోనిధి పెండ్లియాడె నా
నామనుజేంద్రవందితగు
ణస్థితిలక్షణ [29] సత్యభామ, ను
ద్దామపతివ్రతాత్వనయ
ధర్మవిచక్షణతాదయాయశ
స్కామను, సత్యభామను, ము
ఖద్యుతినిర్జితసోమ, నయ్యెడన్. 38

క. మణి యిచ్చినాఁడు [30] వాసర
మణి, నీకును మాకుఁ గలవు మణులు, కుమారీ
మణిచోలు నంచుఁ గృష్ణుఁడు
మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్. 39

28. విపత్పయోధితరి = ఆపత్సముద్రమును దాఁటించు నావ. 29. సత్య
భామ=సత్యముచేఁ బ్రకాశించునది. 30. వాసరమణి=దినమణి, సూర్యుఁడు.

రెండవ భాగము.

# వ్యాకరణ విషయములు.

I. పూర్వవాచక పుస్తకములలోని వ్యాకరణాంశములను గూర్చి బాలురతో విపులముగాఁ జర్చింపవలెను.

II. (a) కొన్ని నామవాచకములు, చేత, కొఱకు మొదలగు సామాన్య విభక్తిప్రత్యయములు గాక ద్వితీయాది విభక్తులలోను, నొకప్పుడు సమాసములలోను, మఱి కొన్ని ప్రత్యయములను దీసికొను.

ఇ, టి, ంటి, తి వ మొదలగునవి యట్టియుపవిభక్తి ప్రత్యయములు. ఇవి గలపదము లౌపవిభక్తికములు, ఉ. క్రిందికి ఏటియందు, వింటికో, నేతిలోపల, కూటికుండ, కంటెసొంపు, వేఁపచెట్టు, అంబటినీళ్లు,

(b) ఉపవిభక్తి ప్రత్యయములు ప్రథమైక వచనమందును. దఱచుగా బహువచనములందును గాన్పింపవు. ద్వితీయాద్యేకవచనములందునఁ జూపట్టును ; ఉ. నీరు, నీళ్లు, నీటిని, నీళ్ళను, నీటియందు, నీళ్లయందు.

(c) ఔపవిభక్తికములయొక్క ద్వితీయాసప్తముల యేక వచనరూపములు దెలిసిన, సాధారణముగాఁగడమరూపములు స్పష్టమగును. ద్వితీయ, కాయాప్రత్యయములు చేర్చినఁ, దక్కినవేర్పడును. ఉ. త్రాటిని, త్రాటన - త్రాటియందు; (త్రాటికొఱకు; త్రాటికి, త్రాటికంటె మొదలగునవి.)

(d) ఈ క్రింది జాబితాలో ముఖ్యమైన యాపవిభక్తికము లున్నవి. అందులోఁ బెక్కులు వాచకపుస్తకములో వచ్చి యుండవచ్చును. వాని వివిధవిభక్తివచనరూపములకుఁ బిల్లల నలవాటుపఱుపవలెను. అనేక రూపములున్నచోట్ల నీతరగతిలో సామాన్యముగా వాడుకలో నుండునవి తెలిసికొనినఁ జాలును:—ఆలు (చెల్లెలు, కోడలు; మఱఁదలు, కొమారులు, ముద్దరాలు, త్రాడు, కన్ను (మిన్ను) విల్లు (పల్లు, ముల్లు) చేయి (గోయి, నేయి, వాయి), కొడవలి, వేయి (రేయి), తాయి, చేను మేను, కొలను (కలను; కెలను, మ్రాను; అట్టు (కొట్టు మిట్టు) ఏఁడు, ఊరు, నోరు (గోరు), పేరు, ఏఱు, క్రిందు (మీఁదు) చోటు పగలు (మొదలు)

పై వాని ప్రథమాబహువచనములును, ద్వితీయా సప్తమ్యేక వచనములును తెలిసికొనినయెడల, మిగిలినవి సులభము లగును.

II. (a) ను(ని)న్;—వీనికి ద్రుతము లని పేరు. ఇవి చివరనున్న మాటలు ద్రుతప్రకృతికములు. ఉ:—చేతన్.కంటెన్. పెక్కువిభక్తి(ప్రత్యయములు) పోవుదును, పోయితిని. (ఉత్తమపురుషైకవచనములు) పోయెను. పోవును. (కొన్ని ప్రథమపురుషైకవచనములు)వాఁడును, వీఁడును, (సముచ్చయములు) కనుకన్, కావునన్ మొదలగు కొన్ని మాటలు.

(b) మూలపదములయందున్న ని, ను, లు ద్రుతములు గావు:—హాని, మేను.

(c) తాను, నేను, మాత్రము సంధివిషయములలో ద్రుతాంతములుగా నెన్నఁబడుచున్నవి.

(d) ద్రుతాంతపదములు గానివి కళలు:—

1. రాముఁడు, రాముఁడా! బాలకులు, బాలకులారా! (ప్రథమా సంబోధన ప్రథమైకబహువచన రూపములు).

2. కూర్చి, కై, పట్టి, యొక్క, నుండి [ఉండి]:—వీనితోఁ గూడిన పదములు.

3. కొన్ని క్రియారూపములు:—చేసి, చేయక (క్త్వార్థక వ్యతిరేక క్త్వార్థకములు) చేయుచున్న, చేసిన, చేయగల (క్రియావిశేషణములు) చేయుచున్నారు, చేసితిమి, చేసితిరి (అన్ని బహువచనక్రియలు) చేయుచున్నావు, చేసితివి (మధ్యమపురుషక్రియలు) చేయుచున్నాఁడు (కొన్ని ప్రథమపురుషైకవచన రూపములు).

4. ఆశ్చర్యము, దుఃఖము, మొదలగు మనోవికారములను, దెలుపుమాటలు:—కటకటా! ఆహా! ఔరా! కదా!

5. ఇతరములైన కొన్ని మాటలు:—ఊరక, మిన్నక, అప్పుడు, ఇప్పుడు, ఏమి, మఱి, సదా, కొంచెము, ఇంచుక, అ, ఎ, ఏ (చూడకయు, చూడకయె, చూడకే, ఒక్కఁడే) మొదలగునవి.

(e) కళలసంఖ్యకంటె ద్రుతప్రకృతికములసంఖ్య యెక్కువగానఁ గళాపదముల జ్ఞప్తినుంచుకొని తక్కినవన్నియు ద్రుతప్రకృతికము లనుకొనవచ్చును.

III.(a) క, చ, చే, ట, త, ప:—ఈ హల్లు లుచ్చరించుటకుఁ గష్టము, వినుటకును గష్టము. కనుక, వానికిఁ బరుషము లని పేరుపెట్టినారు. ఇంగ్లీషులో వానిని (Hard consonants) అందురు. రెండింటికి నొకటే యర్థము. ఆయక్షరములలోని హల్భాగములు మాత్ర ముచ్చరింప ప్రయత్నించినయెడల నోరు తలుపువేసినట్లయి శబ్దమే మియుఁ బైకిరాదు. కనుక నింగ్లీషులో వానికి (Voiceless consonants) నిర్ణాదములైన హల్లులు) అని కూడఁ బేరు. నోటిపట్టు సడలించిన, బిరడ యూడఁదీసిన సీసాచేప్పుడువంటిచేప్పు డగును.

(b) గ, జ, డ, ద, బ:—ఇవి యుచ్చరించుటసులభము. చెవికి మృదువుగానుండును. కనుక వానిని సరళము లందురు. ఇంగ్లీషులో వానికి (Soft consonants) అని పేరు. 'Soft' అనినను 'సరళ' మనినను దదిదాపుగా, నొకటే యర్థము.

హల్భాగము లుచ్చరించునపు డొకతరహా యంతశ్శబ్దము వినఁబడును. కనుక వానికి (Voiced consonants) సనాదములైన హల్లులు) అని పేరు.

IV. (a) ద్రుతముమీఁది పరుషముల కామూజాతి సరళములు వచ్చును:—అన్నిటిని గనెను. శత్రువులను జెంపెను. మొదలగునవి.

(b) అట్టిచోట్లద్రుతమునకుమాఱు, ఁ, ం వచ్చును. ద్రుతమైన నిలుచును:—కొడుకుఁ గనెను, కొడుకుంగనెను, కొడుకున్గనెను, కొడుకును గనెను.

## 16-వ పాఠము యొక్క యనుబంధము.

| రాశి పేరు. | ఆకారము. | అందలి నక్షత్రము. |
|---|---|---|
| 1. మేషము. | పొట్టేలు. | అశ్విని, భరణి, కృత్తికలో మొదటిపాదము. |
| 2. వృషభము. | ఎద్దు. | కృత్తికలో మిగిలిన మూడు పాదములు, రోహిణి, మృగశిరలో రెండుపాదములు. |
| 3 మిథునము. | దంపతులు | మృగశిరలో మిగిలిన రెండు పాదములు, ఆర్ద్ర, పునర్వసులో మూడు పాదములు. |
| 4. కర్కాటకము. | ఎండ్రి. | పునర్వసులో మిగిలిన పాదము, పుష్యమి; ఆశ్లేష. |
| 5. సింహము. | సింహము. | మఖ, పుబ్బ, ఉత్తరలో మొదటిపాదము. |
| 6. కన్య. | కన్య. | ఉత్తరలో మిగిలిన మూడు పాదములు, హస్త, చిత్తలో రెండు పాదములు. |
| 7 తుల. | త్రాసు. | చిత్తలో మిగిలిన రెండు పాదములు, స్వాతి, విశాఖలో మూడు పాదములు. |
| 8. వృశ్చికము. | తేలు. | విశాఖలో మిగిలిన పాదము, అనూరాధ, జ్యేష్ఠ. |
| 9. ధనుస్సు. | విల్లు. | మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢలో నొక పాదము. |
| 10. మకరము. | మొసలి. | ఉత్తరాషాఢలో మిగిలిన మూడు పాదములు, శ్రవణము, ధనిష్ఠలో రెండు పాదములు. |
| 11. కుంభము. | కడవ. | ధనిష్ఠలో మిగిలిన రెండుపాదములు, శతభిషము, పూర్వాభాద్రపదలో మూడు పాదములు. |
| 12. మీనము. | చేప. | పూర్వాభాద్రపదలో మిగిలిన పాదము, ఉత్తరభాద్రపద, రేవతి. |